విశేషకస్స్యా త్తిలకే విశేషా విశేషకః—(పు) బొట్టు, అతిశయము
వాహకేఽపి చ, పొందినవాఁడు.

విదూషక శ్చాటువటౌ పర విదూషకః—(పు) వాక్చాతుర్యముచే
నిందాకరేఽపి చ. ౧౯౮ తను, ఆకారముచేతను నవ్వుపుట్టించు
వాఁడు, పరనిందకుఁడు.

భవే త్రైస్రకతికం మాతృ సైకతికం—(న) తల్లితో ప్రయాణము
యాత్రా మంగళసూత్ర జేయుట, మంగళసూత్రము, సన్న్యా
యోః, తథా సన్న్యస్తసం సి, సందేహింపఁబడిన జీవనము గల
దేహ జీవ క్షేపణకేష్వపి. వాఁడు, క్షపణమతస్థుఁడు.

ఏడమూక స్స్మృతో ధీరై ఏడమూకః—(పు) మోసగాఁడు, చెవుడు,
శ్నతే వాక్ఛ్రుతివర్జితే, మూఁగతనము గలవాఁడు.

వర్తరూకో నదీభేదే కాకనీ వర్తరూకః—(పు) నదీవిశేషము, కాకి
డే జలావటే. ౧౯౯. గూఁడు, నీళ్లబావి.

కాకరూక ఉలూకేస్యా న్ని కాకరూకః—(పు) గుడ్లగూబ, దరి
స్స్వే స్త్రీజితదంభయోః, ద్రుఁడు, ఆఁడుదానిచే జయింపఁబడిన
దిగంబరే భీరుకే చ వాఁడు కపటము, వస్త్రవిహీనుఁడు,
పిఱికివాఁడు.

దందశూకోఽహిరక్షసోః. దందశూకః—(పు) పాము, రాక్షసుఁడు.

మృష్టేరుకో వదాన్యేఽపి మృష్టేరుకః—(పు) దాత, తిండిపోతు,
మృష్టాశిన్యతిథిద్విషి, అతిథిద్వేషి.

కృకవాకుర్మయూరేఽపి సర కృకవాకుః—(పు) నెమిలి, తొండ, కోడి.
టే చరణాయుధే. ౨౦౦.

రాథరంకుస్తు నాసీరే శీకరే రాథరంకుః—(పు) సేనాముఖము, జల
చ ఘనోపలే, బిందువు, వడగండ్లు.

కలవింక స్స్మృతో గ్రామచట కలవింకః—(పు) ఊరపిచ్చుక, కూకటి
కే చ కళింగకే. ౨౦౧. మూఁగపిట్ట.

సౌగంధికం తు కల్హారే పద్మ సౌగంధికం—(న) ఎఱ్ఱకలువ, పద్మరాగ
రాగే చ కత్తృణే, గం ము, కామంచిగడ్డి. సౌగంధికః—(పు)
ధోపలే గాంధికే తు సౌ గంధకము సుగంధద్రవ్యము లమ్ము
గంధిక ఇతి ధ్వనిః. ౨౦౨. వాఁడు.

| | |
|---|---|
| సోమవల్కస్తు ధవళ ఖదిరే ఖట్ఫలేఽపి చ, | సోమవల్కః—(పు) తెల్లచండ్రచెట్టు, తేకుమ్రాను. |
| భయానకస్స్మృతో వ్యాఘ్రే సైంహికేయేఽపి భీషణే. ౨౦౩. | భయానకః—(పు) పెద్దపులి, రాహువు, (త్రి) భయంకరమైనది. |
| పుండరీకం సితాంభోజే సితచ్ఛత్రే చ భేషజే, కోశకారాంతరే వ్యాఘ్రే పుండరీకోఽగ్నిదిగ్గజే. ౨౦౪. | పుండరీకం—(న) తెల్లతామరపూవు, తెల్లగొడుగు, ఓషధీవిశేషము, పట్టుకాయలోనిపట్టుపురుగు, పుండరీకః--(పు) తెల్లచెఱుకు, పెద్దపులి, ఆగ్నేయదిగ్గజము. |
| జర్జరీకం బహుచ్ఛిద్రే జర్జరీకో జరాతురే, | జర్జరీకం—(న) జల్లెడ. జర్జరీకః—(పు) ముదిమిచేతఁ దొట్రుపడువాఁడు. |
| చర్చరీకో మహాకాళే కేశవిన్యాసశాకయోః. ౨౦౫. | చర్చరీకః—(పు) ముసిఁడిచెట్టు, కేశపాశము, శాకవిశేషము. |
| తర్తరీకం వహిత్రే స్యాత్తర్తరీకశ్చ పారగే, | తర్తరీకం—(న) ఒకవిధమగునోడ, (తెప్ప) తర్తరీకః—(పు) పారము నొందినవాఁడు. |
| ఫర్ఫరీకశ్చపేటే స్యాత్ఫర్ఫరీకం తు మార్దవే. ౨౦౬. | ఫర్ఫరీకః—(పు) చెంపకాయ. ఫర్ఫరీకం-(న) మృదుత్వము, |
| భవేదుత్కలికోత్కంఠా హేలా సలిలవీచిషు, | ఉత్కలికా—(స్త్రీ) వేడుక, విలాసము, తరంగము. |
| సృగాలికా శివాయాం స్యాత్త్రాసాదపి పలాయనే. | సృగాలికా—(స్త్రీ) ఆఁడునక్క, భయమువలనఁ బరుగెత్తుట. |
| చండాలికా కిన్నరాయాము మాయామోషధీభిది, | చండాలిక—(స్త్రీ) వీణ, పార్వతి, ఓషధీవిశేషము. |
| పాంచాలికాభవేద్వస్త్రపుత్రికాగీతభేదయోః. ౨౦౭ | పాంచాలికా—(స్త్రీ) వస్త్రాదులతోఁ జేయు బొమ్మ, పాంచాలీగీతిభేదము. |
| కనీనికా తారకేఽక్ష్ణస్స్యాత్కనిష్ఠాంగుళావపి, | కనీనికా—(స్త్రీ) కంటిలోని నల్లగ్రుడ్డు, చిటికెనవ్రేలు. |
| భవేద్గుణనికా నృత్యే శూన్యాంకే పాఠనిశ్చితే | గుణనికా—(స్త్రీ) నాట్యము, శూన్యపు గుర్తు, పాఠమును ధ్రువపఱుపఁజెప్పి |

| | |
|---|---|
| | నది తిరిగి చెప్పుట. |
| సంతానికాపి క్షీరాదిసారే మర్కటజాలకే, | సంతానికా—(స్త్రీ) పాలు పెరుగు పైనిగల మీఁగడ, సాలెపురుగు, మగ్గము. |
| సందంశికాతు సుచుటీ లోహయంత్రవిశేషయోః. | సందంశికా—(స్త్రీ) పటకారు, పట్టుపట్టెడి యంత్ర విశేషము. |
| సంఘాటికాతు యుగ్మే స్యాత్కుట్టనీ ఘ్రాణయోరపి, | సంఘాటికా—(స్త్రీ) జంట, కుంటెనకత్తె, ముక్కు. |
| జీవంతికాతు జీవాఖ్య శాక వందీ గుడూచిషు. ౨౧౧ | జీవంతికా—(స్త్రీ) నీటిచిత్రిచెట్టు, బదనిక, తిప్పతీఁగ. |
| విద్యా ద్బృహంతికాభిఖ్యా మూరు వస్త్రప్రభేద యోః, | బృహతికా—(స్త్రీ) తొడ, ఉత్తరీయము. |
| బకేరుకో బలాకాభి ద్వాత వేల్లితశాఖయోః. ౨౧౨. | బకేరుకః—(పు) బెగ్గురుపక్షి, గాలికి వంగిన కొమ్మలు గలచెట్టు. |
| స్మృతా ఘుర్ఘురికా క్షుద్ర ఘంటికా భ్రష్టధాన్య యోః, వాద్యప్రభేద వాదిత్రే దండయో రాపగాంతరే. ౨౧౩. | ఘుర్ఘురికా—(స్త్రీ) చిఱుగంటలు, పేలాలు, వాద్యవిశేషము, వాయించుకట్టె, నదీ విశేషము. |

---

| అథ కాంతః పంచవర్ణః. | కాంత పంచవర్ణము. |
|---|---|
| స్యాదాచ్ఛురితకంహాస నఖాఘాతవిశేషయోః, | ఆచ్ఛురితకం—(న) ఎత్తిపొడుపుతోఁగూడిన నవ్వు, నఖక్షతవిశేషము. |
| ప్రతిసూర్యక మిచ్ఛంతి కృకలాసోపసూర్యయోః. ౨౧౪. | ప్రతిసూర్యకం—(న) తొండ, సూర్యుని సమీపమునుండు ప్రతిమండలము (పరివేషము). |
| అనేడమూక మిచ్ఛంతి వాక్యశ్రుతివివర్జితే, | అనేడమూకః—(త్రి) చెవుడు, మూగతనముగలవాఁడు. |
| రాజపట్టస్య కాచస్య గుడకే కాచవర్తికః. ౨౧౫. | కాచవర్తికః—(పు) కృత్రిమమణి విశేషము, గాజుకాయ. |

| | |
|---|---|
| గోజాకరిక మిత్యాహు ర్మం గలే కంటకారకే, | గోజాకరికం—(న)శుభము,గోచారికః—(పు) వాకుడుచెట్టు. |
| స్యాత్కృమికంటకం చిత్రా విడంగోదుంబరేషు చ. | కృమికంటకం—(న)ఎలిక చెవిచెట్టు, వాయువిడంగము, మేడిచెట్టు. |
| సువసంతక ఇత్యేష వాసంత్యాం మదనోత్సవే, | సువసంతకః—(పు) బండిగురివెంద, వసంతకాలమునఁ జేయుమదనోత్సవము. |
| కఞ్చుకీ మిచ్ఛంతి శుద్ధాంతోద్యానపాలయోః ౨౧౭. ద్వారపాలే కవే షింగే రంగాజీవిన్యపి క్వచిత్, | కఞ్చుకీః—(పు)అంతఃపురరక్షకుఁడు, ఉద్యానవనపాలకుఁడు, ద్వారపాలకుఁడు, కవి, విటుఁడు, నాట్యము చేయువాఁడు. |
| నాగచారిః ఉద్దిష్టో హస్తిపే రాజకుంజరే. ౨౧౮. గణస్థరాజే గరుడే చిత్రమేఖలకే క్వచిత్, | నాగచారికః—(పు) మావటివాఁడు, రాజులెక్కెడి యేనుఁగు, వినాయకుఁడు, గరుత్మంతుఁడు, నెమలి. |
| స్యా ద్వ్రీహిరాజికః కామలికాయాం చీనధాన్యకే ౨౧౯. | వ్రీహిరాజికః—(న) రోగవిశేషము, (కామెలరోగము) కొఱ్ఱలలో భేదము. |
| శీతచంపకశబ్దోఽయం స్యా దాతర్పణ దీపయోః, | శీతచంపకః—(పు)చందనాదులమైపూఁత, దీపము. |
| అంధో జలకరంకః స్యాన్నారికేళఫలేఽంబువే. ౨౨౦ శంఖే జలలతాయాం చ కథ్యతే | జలకరంకః—(పు) టెంకాయ, మేఘము, శంఖము, తరంగము. |
| జలవాపికాః, కాకచీ రాదిశఫరమత్స్యయోః | జలవాపికః—(పు) కాకోచియను చేఁప, ఇల్లీసకమను మత్స్యవిశేషము. |
| కటఖాదకః. ౨౨౧. ఖాదకే కాచకలశే బలిపుష్టే చ జంబుకే, | కటఖాదకః—(పు) భక్షించువాఁడు, గాజుపాత్ర, కాకి, నక్క. |
| స్యా చ్ఛిలసీలికా కంఠీ భేదే | చిలసీలికా—(స్త్రీ) కంటెనానువంటి కంఠ |

| | |
|---|---|
| ఖద్యోతవిద్యుతోః. ౨౨౨. | భూషణము, మిణుగురుపురుగు, మెఱుపు. |
| స్యాన్నవఫలికా నవ్యే నవ జాతరజస్త్రియాం, | నవఫలికా—(స్త్రీ)నూతనవస్తువు, క్రొత్తగా సమర్తాడిన పడుచు, |
| స్యాచ్ఛతపర్వికా దూర్వా వచయో | శతపర్వికా—(స్త్రీ) గఱికెగడ్డి, వస. |
| రుపకారికా. ౨౨౩. పిష్టభేదే గృహే రాజ్ఞా ముపక ర్త్ర్యా మపీష్యతే, | ఉపకారికా—(స్త్రీ) నీటితో తడిపిన పిండి, రాజగృహమున నుపకరించునది. |
| స్యాద్వ్యవహారికా లోక యాత్రా సంమార్జనీం గృదే. ౨౨౪. | వ్యవహారికా—(స్త్రీ) లౌకికవ్యవహారము, చీపురుకట్ట, గారచెట్టు. |
| స్యాద్ధేమపుష్పికా యూథ్యాం చంపకే హేమ పుష్పకః. | హేమపుష్పికా—(స్త్రీ) పచ్చపూవులఅడవి, మొల్లచెట్టు. హేమపుష్పకః—(పు) సంపెంగచెట్టు. |

---

| అథ కాంతః షడ్వర్ణః. | కాంత షడ్వర్ణము. |
|---|---|
| లూతామర్కటకః పుత్ర్యాం నవమాల్యాం ప్లవంగమే. | లూతామర్కటకః—(పు) వృక్షవిశేషము, విరజాజిచెట్టు, కోతి. |
| సిందూరతిలకో నాగే సిందూ రతిలకా స్త్రియాం, | సిందూరతిలకః—(పు) ఏనుఁగు, సిందూ రతిలకా—(స్త్రీ) ముత్తైదువ. |
| వర్ణవిలోడక శ్లోకేచ్ఛాయా హారిణి కుంభిలే. ౨౨౬. | వర్ణవిలోడకః—(పు) శ్లోకభావములను దొంగిలించు దుష్కవి, కన్నపుదొంగ. |
| మాతులపుత్రకో ధూర్త ఫలే స్యాన్మాతులాత్మజే, | మాతులపుత్రకః— (పు) ఉమ్మెత్తకాయ, మేనమామకుమారుఁడు. |
| గ్రామమద్గురికా శృంగ్యాం గ్రామయుద్ధే చ కీర్త్యతే, | గ్రామమద్గురికా—(స్త్రీ) బొమ్మిడాయియను నాఁడుచేప, గ్రామయుద్ధము. |
| స్యాన్మదనశలాకాతు సా ర్యంకామోదయోషధౌ. | మదనశలాకా—(స్త్రీ) గోరువంక, మన్మథో ద్దీపనమగు నౌషధము. |

---

అథ ఖాంత ఏకవర్ణః.

ఖ మింద్రియసుఖే స్వర్గే శూన్యే బిందౌ విహాయసి, పురే సంవేదనే క్షేత్రే కులాహాలఫలే క్వచిత్. ౧.

ఖాంత ఏకవర్ణము.

ఖం—(న) నేత్రాదీంద్రియములు, సౌఖ్యము, స్వర్గము, లేకపోవుట, అనుస్వారము, ఆకాశము, పట్టణము, తెలివి, వరిమడి, అలంబుషవృక్షఫలము.

---

అథ ఖాంతో ద్వివర్ణః.

ఖాంత ద్వివర్ణము.

నఖః కరరుహే షండే గంధద్రవ్యే నఖం, నఖీ,
నఖః—(పు) గోటిచిప్ప, నపుంసకుఁడు. (స్న) శంఖమను గంధద్రవ్యము.

ముఖం నిస్సరణే వక్త్రే ప్రారంభోపాయయోరపి. ౨.
ముఖం—(న) ఇంటిముందుండు తావు, ముఖము, ఆరంభము, ఉపాయము.

సుఖం కర్మణి నాకే చ సుఖా పుర్యాం ప్రచేతసః,
సుఖం—(న) సుఖము, స్వర్గము, సుఖా-(స్త్రీ) వరుణదేవుని పట్టణము.

శంఖో నిధ్యంతరే కంబు లలాటాస్థి నఖీషు చ. ౩.
శంఖః—(పు) కుబేరునినిధి, శంఖము, ఫాలస్థలమునందలి యెముక, శంఖమను సుగంధవస్తువు.

రేఖా స్యాదల్పకే ఛద్మన్యాం భోగోల్లేఖయోరపి.
రేఖా—(స్త్రీ) తీటఁసింద చెట్టు, నెపము, రచనాదులపూర్తి, గీత.

లేఖో లేఖ్యే సురే లేఖాలిపి రాజికయోః స్మృతా. ౪.
లేఖః—(త్రి) వ్రాయఁబడినది, లేఖః—(పు) దేవత, లేఖా—(స్త్రీ) వ్రాఁత, పంక్తి.

న్యంఖ స్సమ్యఙ్మనోజ్ఞేఽపి సామ్నః షట్ప్రణవేషు చ,
న్యంఖః—(పు) బాగుగనున్నది, మనోహరమైనది, సామవేదనియతమగు ప్రణవషట్కము.

శిఖా శిఫాయాం చూడాయాం జ్వాలాయామగ్రమాత్రకే. ౫. లాంగల్యాశ్చాపి శాఖాయాం చూడాయాం చ శిఖండినః.
శిఖా—(స్త్రీ) ఊడ, కేశపాశము, అగ్నిజ్వాల, కొన, తరిగొట్టుచెట్టు, కొమ్మ, నెమలిజుట్టు. (నెమిలితలపయినుండు ఈఁకలు).

| | |
|---|---|
| సఖా మిత్రే సహాయే చ | సఖా—(ఇ-పు) చెలికాఁడు, సహాయము చేయువాఁడు. |
| శాఖా పక్షాంతరే భుజే. ౬ శాఖా వేదవిభాగే చ పాదపాంగేఽంతికేఽపి చ, | శాఖా—(స్త్రీ) ఒక పక్షము, భుజము, వేదవిభాగము, కొమ్మ, సమీపము. |
| ప్రేంఖా పర్యటనే నృత్యే భవేదశ్వగతావపి. ౭. | ప్రేంఖా (స్త్రీ) తిరుగులాడుట, నాట్యము, గుఱ్ఱపునడక. |
| ఖంఖా గతివిశేషేఽపి శూకశింబ్యాం చ నర్తనే, | ఖంఖా—(స్త్రీ) అశ్వగమనవిశేషము, దూలగొండిచెట్టు, నాట్యము. |

| అథ ఖాంత స్త్రివర్ణః. | ఖాంత త్రివర్గము. |
|---|---|
| త్రిశిఖం శేఖరే విద్యాత్త్రిశూలే రాక్షసాంతరే. ౮. | త్రిశిఖం—(న) కిరీటము, త్రిశూలాయుధము. త్రిశిఖః—(పు) త్రిశిఖుఁడను రావణపుత్రుఁడు. |
| సుముఖం తార్క్ష్యతనయే ఫణిభేదే చ పండితే, | సుముఖః—(పు) గరుడునిపుత్రుఁడు, సర్పవిశేషము, పండితుఁడు. |
| దుర్ముఖో నాగరాజేఽపి ముఖరే వానరాశ్వయోః. ౯. | దుర్ముఖః—(పు) సర్పవిశేషము, దుఃఖపడువాఁడు, కోఁతి, అశ్వము. |
| గోముఖం కుటిలాగారే వాద్యభాండే చ లేపకే, | గోముఖం—(న) వంకరగానుండు యిల్లు, వాయించుకుండ, మైపూఁత. |
| ప్రముఖః ప్రథమే శ్రేష్ఠే | ప్రముఖః—(పు) ముఖ్యమైనది, శ్రేష్ఠమైనది. |
| విశిఖ స్తోమరే శరే. రథ్యాం ఖనిత్ర్యాం విశిఖా నాలికాయామపి క్వచిత్. | విశిఖః—(పు) నేజాయను నాయుధము, బాణము. విశిఖా—(స్త్రీ) రాజవీథి, త్రవ్వుగోల, బాణపుములికి. |
| మయూఖ స్త్విట్కరజ్వాలే | మయూఖః—(పు) కాంతి, కిరణము, అగ్నిజ్వాల. |
| వైశాఖో రాధ మంథయోః. | వైశాఖః—(పు) ఒకనెల, కవ్వము. |

| అథ ఖాంత శ్చతుర్వర్ణః. | ఖాంత చతుర్వర్ణము. |
|---|---|
| అగ్నిముఖో ద్విజే దేవే భల్లాతే చిత్రకే క్వచిత్, | అగ్నిముఖః—(పు) బ్రాహ్మణుఁడు, దేవత, జీడిచెట్టు, చిత్రమూలము. |
| పంచనఖో గజే కూర్మే | పంచనఖః—(పు) ఏనుఁగు, తాఁబేలు. |
| శిలీముఖోఽలిబాణయోః. | శిలీముఖః—(పు) తుమ్మెద, బాణము. |
| భవే ద్వ్యాఘ్రనఖః కంద గంధద్రవ్యవిశేషయోః, | వ్యాఘ్రనఖః—(పు) ఒకానొకదుంప, పులిగోరుచెట్టు. |
| మహాశంఖో నరాస్థ్ని స్యాన్నిధిసంఖ్యాప్రభేదయోః. | మహాశంఖః—(పు) మనుష్యునియెముక, కుబేరునినిధి, పదిఖర్వములపరిమితి. |
| ఇందులేఖాఽమృతా సోమలతా శశికళాసు చ, | ఇందులేఖా—(స్త్రీ) తిప్పతీఁగ, సోమలత, చంద్రరేఖ. |
| శశిరేఖా కళాభాగే వాకుచీవృక్షభేదయోః. ౧౪. | శశిరేఖా—(స్త్రీ) చంద్రకళ, తిప్పతీఁగె, ఈ వేసుగల యొకపద్యము. |
| లాంగలిక్యా మగ్నిశిఖా కుంకుమేఽగ్నిశిఖం మతం, | అగ్నిశిఖా—(స్త్రీ) తరిగోట్టుచెట్టు. అగ్నిశిఖం—(న) కుంకుమపూవు. |
| స్యాజ్జటాయాం బద్ధశిఖా బాలే బద్ధశిఖో మతః.౧౫ | బద్ధశిఖా—(స్త్రీ) జడ. బద్ధశిఖః—(పు) బాలుఁడు. |

| అథ ఖాంతః పంచవర్ణః. | ఖాంత పంచవర్ణము. |
|---|---|
| స్యాన్మలినముఖః ప్రేతే గోలాంగూలేఽనలే ఖలే, | మలినముఖః— (పు) పీనుఁగు, కొండముచ్చు, అగ్నిహోత్రము, నీచుఁడు. |
| అథ శీతమయూఖోఽపి శశాంక ఘనసారయోః.౧౬ | శీతమయూఖః—(పు) చంద్రుఁడు, పచ్చకర్పూరము. |
| సర్వతోముఖ మాఖ్యాత మంతరిక్షే చ పాథసి, విధి క్షేత్రజ్ఞ రుద్రేషు కథిత స్సర్వతోముఖః. ౧౭. | సర్వతోముఖం—(న) ఆకాశము, జలము. సర్వతోముఖః—(పు) బ్రహ్మ, జీవుఁడు, శంకరుఁడు. |

అథ గాంత ఏకవర్ణః.

గౌః స్వర్గే వృషభే రశ్మౌ వజ్రే చంద్రమసి స్మృతః, అర్జునీ నేత్రదిగ్బాణభూ వాగ్వారిషు గౌర్మతా. ౧

గాంత ఏకవర్ణము.

గౌః—(పు) స్వర్గము, వృషభము, కిరణము, వజ్రాయుధము చంద్రుఁడు—(స్త్రీ) గోవు, నేత్రము, దిక్కు, బాణము, భూమి, వాక్కు, జలము.

---

అథ గాంతో ద్వివర్ణః.

గాంత ద్వివర్ణము.

అగః శైలేద్రుమేభానౌ నగవత్పవనాశనే, — అగః—(రూ) నగః—(పు) పర్వతము, వృక్షము, సూర్యుఁడు, సర్పము.

ఖగ స్సూర్యే గ్రహే దేవే మార్గణేచ విహంగమే. ౨ — ఖగః—(పు) సూర్యుఁడు, శుక్రాదిగ్రహము, దేవత, బాణము, పక్షి.

భగ మైశ్వర్యమాహాత్మ్య జ్ఞానవైరాగ్యయోనిషు, యశో వీర్య ప్రయత్నే చ్ఛా శ్రీధర్మ రవిముక్తిషు. ౩. — భగం—(న) ఐశ్వర్యము, ప్రభావము, జ్ఞానము, వైరక్తి, యోని, కీర్తి, పరాక్రమము, ప్రయత్నము; కోరిక, సంపద, ధర్మము, సూర్యుఁడు, ముక్తి.

యుగం కృతాదౌ యుగళే వృద్ధినామౌషధేఽపి చ, యుగం హస్తచతుష్కేఽపి రథసీరాంగయో ర్యుగః. ౪. — యుగం—(న) నాలుగు యుగములు, జంట, ఒకానొకయోషధి, నాలుగు చేతులప్రమాణము, యుగః—(పు) రథము నాగలిమున్నగు వానికాడి.

మృగః పశౌ కురంగే చ కరినక్షత్రభేదయోః, యాచ్ఞాయాం మృగయాయాంచ మృగీ స్యా ద్వనితాంతరే. ౫. — మృగః—(పు) పశువు, లేడి, గజవిశేషము, మృగశీర్షనక్షత్రము, యాచన, వేట. మృగీ—(స్త్రీ)పులహుఁడను మునీశ్వరునిభార్య.

భృగు శ్శుక్రే ప్రపాతే చ జమదగ్నౌ పినాకిని, — భృగుః—(పు) శుక్రుఁడు, కొండచరియ, జమదగ్నిముని, ఈశ్వరుఁడు.

భాగో రూపార్ధకే ప్రోక్తో భాగధేయైకదేశయోః. ౬ — భాగః—(పు) నాటకాదులభాగము, భాగ్యము, ఏకదేశము.

నాగంతుసీసకే రంగే స్త్రీబంధే — నాగం—(న) సీసము, తగరము, రతిబంధ

కరణాంతరే, నాగః పన్నగమాతంగ క్రూరాచారిషు తోయదే. ౯. నాగకేసరపున్నాగ నాగదంతక ముస్తకే, దేహానిలప్రభేదేచ శ్రేష్ఠే స్యాదుత్తరస్థితః. ౧౦.

విశేషము, నాగకరణము, నాగః—(పు) సర్పము, ఏనుఁగు, క్రూరాచారుఁడు, మబ్బు, నాగకేసరవృక్షము, పొన్నచెట్టు, గజదంతము, తుంగముస్తె, దేహమునందలివాయు విశేషము, సమాసోత్తరపదమున శ్రేష్ఠవాచకము.

రాగోఽనురక్తౌ మాత్సర్యే క్లేశాదౌ లోహితాదిషు, గాంధారాదౌ నృపే రాగ

రాగః—(పు) అనురాగము, పరాభివృద్ధి సహింపకపోవుట, క్లేశాదులు, ఎఱుపు, సిందూరము, బాలింతబోలుమున్నగు ధాతువులు, గాంధారము మున్నగు రాగ రాజములు.

త్యాగో వర్జనదానయోః.

త్యాగః—(పు) విడుచుట, ఈవి.

భోగస్సుఖే ధనే చాహేశ్శరీరఫణయోస్స్మృతః, పాలనేఽభ్యవహారేచ నిర్వేశే పణ్యయోషితాం ౧౨.

భోగః—(పు) సుఖము, ధనము, సర్పము యొక్క శరీరము, పడగ, పరిపాలించుట, భుజించుట, జీతమిచ్చి వేశ్యనుంచుకొనుట.

యోగోఽపూర్వార్థసంప్రాప్తౌ సంగతిధ్యానయుక్తిషు, వపుస్స్థైర్యే ప్రయోగే చ విష్కంభాదిషు భేషజే. ౧౩. విస్రబ్ధఘాతిని ద్రవ్యోపాయసన్నహనేష్వపి, కార్మణేఽపి చ యోగస్స్యా

యోగః—(పు) పూర్వములేని ద్రవ్యాదులు లభించుట, కూటమి, ధ్యానము, కూర్చుట, శరీరస్థైర్యము, ప్రయోగము, విష్కంభాదులగు యోగములు, ఔషధయోగము, విశ్వాసఘాతుకునకు, ధనము, ఉపాయము, కవచాదిసన్నాహము. మూలికతో స్తంభనాదులు చేయుట.

ద్రోగః కుష్ఠౌషధే గదే.

రోగః—(పు) కుష్ఠురోగనివారణౌషధము, రోగము.

వేగో జవే ప్రవాహే చ మహాకాలఫలేఽపి చ,

వేగః—(పు) వేగము, నదీప్రవాహము, ముసిఁడిపండు.

పూగస్తు క్రముకే బృందే

పూగః—(పు) పోఁకచెట్టు, సమూహము.

చంగ శ్శోభనదక్షయోః.౧౩ — చంగః—(పు) శుభము, సమర్థుఁడు.

అంగం గాత్రాంతికోపాయ ప్రతీకేష్వప్రధానకే, — అంగం—(న) శరీరము, సమీపము, ఉపాయము, అవయవము, అప్రధానమైనది.

అంగా దేశవిశేషే స్యు రంగ సంబోధనేఽవ్యయం.౧౪. — అంగాః—(పు) నిత్యబహువచనము. అంగదేశము, (అవ్య) సంబోధనము.

ఇంగస్స్యా దద్భుతే జ్ఞానే జంగమేంగితయోరపి, — ఇంగః—(పు) ఆశ్చర్యము, జ్ఞానము, ఇంగం—(న) మనుష్యపశుపక్ష్యాదులు, మనోభావము.

టంగః కృపాణభేదే స్యా జ్జంఘాయాం చ ఖనిత్రకే. — టంగః—(పు) ఖడ్గవిశేషము, పిక్క, త్రవ్వుగోల.

తుంగః పున్నాగనగయో స్తుంగస్స్యా దున్నతేఽన్యవత్, బర్బరా నిశయో స్తుంగీ — తుంగః—(పు) పొన్నచెట్టు, పర్వతము—(వి) ఉన్నతమైనది. తుంగీ—(స్త్రీ) వామంటిచెట్టు, పసుపు.

వంగం సీస కరంగయోః. ౧౬ వంగః కార్పాసనార్తాక దేశభేదేషు కీర్తితః, — వంగం—(న) సీసము, తగరము, వంగః—(పు) ప్రత్తిచెట్టు, వంగచెట్టు, వంగదేశము.

లంగ స్సంగే చ షిద్గే చ — లంగః—(పు) కలిసికొనుట, విటుఁడు.

వ్యంగో హీనాంగ భేకయోః. — వ్యంగః—(పు) అంగహీనుఁడు, కప్ప.

భంగ స్తరంగే రుగ్భేదే భేదే జయ విపర్యయే, భంగా శణాఖ్యసస్యేఽపి — భంగః—(పు) తరంగము, వాతరోగము, భేదము, పరాజయము. భంగా—(స్త్రీ) జనుము.

భృంగో ధూమ్యాట షిద్గయోః. ౧౭. మధువ్రతేఽపి, భృంగం తు కేశరాజ గుడత్వచోః, — భృంగః—(పు) మూకటి మూకపిట్ట, విటుఁడు, తుమ్మెద, భృంగం—(న) గుంటకలగరచెట్టు, లవంగపుచెట్టు.

రంగో రణస్థలే రాగే నాట్యే రంగం త్రపుణ్యపి. ౧౮. — రంగః—(పు) యుద్ధస్థలము, రక్తి, నాట్యము, రంగం—(న) తగరము.

లింగం చిహ్నేఽనుమానేఽపి — లింగం—(న) గుర్తు, అనుమానమందలి

సాంభో ర్వ్యక్తప్రకృతావపి, శివమూర్తి విశేషే చ మేహనేచ ప్రచక్షతే. ౨౦.
సాధ్యసాధక హేతువు, సాంఖ్యశాస్త్రోక్తప్రకృతి, శివలింగము, శిశ్నము.

శృంగం ప్రభుత్వే శిఖరే చిహ్నే క్రీడాంబుయంత్రకే, విషాణోత్కర్ష యోస్సానౌ శృంగస్స్యాత్కూర్చశీర్షకే. ౨౧. శృంగీ విషాయాం మృషభే స్వర్ణమీనవిశేషయోః,
శృంగం—(న) ప్రభుత్వము, పర్వతశిఖరము, గుర్తు, చిమ్మనగ్రోవి, కొమ్ము, ఉత్కర్ష, కొండచరియ. శృంగః—(పు) జీవకమను గంధద్రవ్యము. శృంగీ—(స్త్రీ) అతివస, ఋషభమను గ్రంధ్యము, బంగారము, మద్గురియనువాఁడు చేప.

గాంగస్తు గంగాసంభూతే భీష్మే శక్తిధరేఽపిచ. ౨౨.
గాంగః—(త్రి) గంగయందుఁబుట్టినది. గాంగః—(పు) భీష్ముఁడు, కుమారస్వామి.

పింగః పిశంగే పింగీతు శమ్యాం పింగంతు బాలకే, రామఠే నాళికాయాంచ పింగా గోరోచనోమయోః. ౨౩.
పింగః—(పు) పింగళవర్ణము. పింగీ—(స్త్రీ) జమ్మిచెట్టు. పింగం—(న) బాలుఁడు. పింగా—(స్త్రీ) ఇంగువ, గొట్టము, గోరోచనము, పార్వతీదేవి.

ఖడ్గో గండక శృంగాసి బుద్ధభేదేషు గండకే,
ఖడ్గః—(పు) ఖడ్గమృగముకొమ్ము, ఖడ్గము, బుద్ధవిశేషుఁడు, ఖడ్గమృగము.

దుర్గస్స్యా ద్దుర్గమే దుర్గా గౌరీ నీలికయోరపి. ౨౪.
దుర్గః—(త్రి) చేరరానిది(కోట) దుర్గా—(స్త్రీ) పార్వతీదేవి, నీలిచెట్టు,

సర్గస్స్యా న్నిశ్చయాధ్యాయ మోహోత్సాహాత్మ సృష్టిషు,
సర్గః—(పు) నిశ్చయము, పురాణాదులలోనుండు అధ్యాయము, మోహము, ఉత్సాహము, సృష్టి.

మార్గో మృగమదే మాసభేదేఽన్వేషణాధ్వనోః. ౨౫. (వాచ్యవన్మృగసంబంధే మార్గోఽపి మృగశీర్షభే)
మార్గః—(పు) కస్తూరి, మార్గశీర్షమాసము, వెదకుట, త్రోవ—(త్రి) [మృగసంబంధమైనది.—(పు) మృగశీర్షనక్షత్రము] ఇది అధికపాఠము.

| | |
|---|---|
| శార్ఙ్గం కార్ముకమాత్రేఽపి విష్ణోరపిశరాసనే, | శార్ఙ్గం—(న) విల్లు, విష్ణుధనువు. |
| వల్గు శ్ఛాగే మనోజ్ఞేతు వల్గు భాషిత మన్యవత్. ౨౮. | వల్గుః—(పు) మేఁకపోతు—(త్రి) మనోహరమైనది. |
| ఫల్గుః ప్రోక్తా ఽమలస్యాంచ నిస్సారేఫల్గువాచ్యవత్, | ఫల్గు—(స్త్రీ) కుక్కమేడిచెట్టు. (త్రి) సారము లేనిది. |
| శృంగీ వటామ్రాతకయోః పర్కట్యామపి విశ్రుతా. | శృంగీ—(స్త్రీ) మఱ్ఱిచెట్టు, అంబాళపుం జెట్టు, జువ్విచెట్టు. |

అథ గాంత స్త్రీవర్ణః. — గాంత త్రివర్ణము.

| | |
|---|---|
| పన్నగం పద్మకాష్ఠేస్యాత్ పన్నగోఽపి భుజంగమే, | పన్నగం—(న) తామరకాడ, పాము |
| ప్లవగో వానరే భేకే సారథౌ చోష్ణదీధితేః. ౨౯. | ప్లవగః—(పు) కోఁతి, కప్ప, అనూరుఁడు. [పాము. |
| జిహ్మగో మందగో సర్పే | జిహ్మగః—(పు) మెల్లఁగఁ బోవువాఁడు, |
| విహగ శ్చాశుగే ఖగే, | విహగః—(పు) బాణము, పక్షి. |
| సర్వగం సలిలే ఖ్యాతం సర్వగ శ్శంకరే విభౌ. ౩౦ | సర్వగం—(న) జలము, సర్వగః—(పు) శివుఁడు, ప్రభువు. |
| ఆభోగో వరుణచ్ఛత్రే పూర్ణతా యత్నయోరపి, | ఆభోగః—(పు) వరుణదేవుని గొడుగు, పరిపూర్ణత్వము, ప్రయత్నము. |
| ఆయోగో వ్యాపృతౌ రోధ గంధమాల్యోపహారయోః. ౩౧. | ఆయోగః—(పు) వ్యాపారము, తీరప్రదేశము. గంధమాల్యాదుల కానుక. |
| అయోగో విధురే కూటే విశ్లేషే కఠినోద్యమే, | అయోగః—(పు) భార్యావియోగమైనవాఁడు, కపటము, వియోగము, కఠినప్రయత్నము. |
| ఆశుగో మారుతే బాణేఽ | ఆశుగః—(పు) వాయువు, బాణము. |
| ప్యుద్వేగం క్రముకీఫలే. ౩౨ ఉద్వేగ స్తిమితే క్లేశే | ఉద్వేగం—(న) పోకకాయ, ఉద్వేగః—(పు) నిశ్చలత్వము, దుఃఖము, భయ |

| | |
|---|---|
| భయే మంథరగామిని, ఉద్వేగో ప్యద్భాపహూల కోద్వేజ నాకోద్గమేపి చ. | ము, నెమ్మదిగాఁ బోవువాఁడు, ఉన్నతభుజుఁడు, ఊర్ధ్వభాగమును గదలించుట, ఆకాశమున కెగిరిపోవుట. |
| సంభోగ స్సురతే భోగే స్యాత్తుండేజినశాసనే, | సంభోగః—(పు) రతి,చందనతాంబూలాదు లనుభవించుట, గజతుండము, బుద్ధుని ఆజ్ఞ. |
| పరాగః పుష్పరజసి ధూళి స్నానీయయోరపి. ౩౩. గిరిప్రభేదే విఖ్యాతా వుపరాగే చ చందనే, | పరాగః—(పు) పుప్పొడి, ధూళి, నలుగుపిండి మున్నగు స్నానార్థవస్తువులు, పర్వతవిశేషము, విఖ్యాతి, సూర్యాదిగ్రహణము, గంధము. |
| ప్రయాగ స్తీర్థభేదే స్యా ద్యజ్ఞశతమఖాశ్వయోః. ౩౪ | ప్రయాగః—(పు) ప్రయాగక్షేత్రము, యజ్ఞము, ఇంద్రుఁడు, గుఱ్ఱము. |
| ప్రయోగః కార్మణే ప్రోక్తః ప్రయుక్తౌ చ నిదర్శనే, | ప్రయోగః—(పు) మూలికలతోఁ జేయు స్తంభనోచ్చాటనాది కర్మ, ప్రయోజనము, దృష్టాంతము. |
| వాతిగః కథితో భంట్యాం ధాతువాదిని వాచ్యవత్. ౩౫. | వాతిగః—(పు) నేలములగచెట్టు, ధాతువాదము నెఱింగినవాఁడు. |
| తడాగస్తు జలాధారవిశేషే కటకేఽపి చ, | తడాగః—(పు) చెఱువు, బంగారు కడియము. |
| పున్నాగః పురుషశ్రేష్ఠే పాండునాగే సితోత్పలే. ౩౬. జాతీఫలేఽపి పున్నాగం | పున్నాగః—(పు) పురుషశ్రేష్ఠుఁడు, తెల్లత్రాఁచుపాము, తెల్లగలువ. పున్నాగం—(న) జాజికాయ. |
| నిసర్గ శ్శీలసర్గయోః, | నిసర్గః—(పు) నడవడి, సృష్టి. |
| విసర్గ స్త్యాగవద్దానే విసర్గో మలనిర్గమే. ౩౭. విసర్జనీయేఽప్యయనప్రభేదేఽపి విభావసోః, | విసర్గః—(పు) త్యాగశబ్దమువంటిది, దానము,మలము విసర్జించుట, విసర్జింపఁదగినది, సూర్యుని అయనవిశేషము. |
| ఉత్సర్గో వర్జనే త్యాగే సామాన్యన్యాయదానయోః. | ఉత్సర్గః—(పు) హింస, విడుచుట,సామాన్యవిధి, దానము. |

| | |
|---|---|
| త్రివర్గో ధర్మకామార్థే త్రిఫలాయాం కటుత్రికే, వృద్ధిస్థానక్షయే సత్త్వరజస్తమసి చేష్యతే. ౩౯. | త్రివర్గః—(పు) ధర్మార్థకామములు, కరక్కాడి ఉసిరకలు, శుంఠి, పిప్పలి, మిరియాలు, వృద్ధి, స్థానక్షయము, సత్త్వరజస్తమోగుణములు |
| తాతగుః క్షుద్రతాతేస్యా జ్జనయిత్రీపితేఽపి చ, | తాతగుః—(పు) పినతండ్రి, తల్లికిపితుఁడు. |
| అనంగో మదనేఽనంగ మాకాశమనసోస్స్మృతం. ౪౦. | అనంగః—(పు) మన్మథుఁడు. అనంగం—(న) ఆకాశము, మనస్సు. |
| మృదంగః పటహే ఘోషే | మృదంగః—(పు) మద్దల, ధ్వని. |
| భుజంగ ష్షింగసర్పయోః, | భుజంగః—(పు) విటుఁడు, పాము. |
| పతంగశ్శలభే శాలిప్రభేదే విహాగే రవౌ. ౪౧. పతంగం పారదే క్వాపి | పతంగః—(పు) మిడుత, సస్యవిశేషము, పక్షి, సూర్యుఁడు, పతంగం—(న) పాదరసము. |
| నరంగంతు వరండకే, శేఫే నరంగమప్యాహు | నరంగం—(న) మొటిమెలు, శిశ్నము. |
| ర్నిషంగస్సంగతూణయోః. | నిషంగః—(పు) కలయిక, అమ్ములపొది. |
| విడంగం కృమిఘ్నఖ్యాతం విడంగో నాగరేఽన్యవత్, | విడంగః—(న) వాయువిడంగము —(త్రి) నేర్పరి. |
| కళింగః పూతికరజే ధూమ్యాటే నీవృదంతరే. ౪౩. కళింగం కౌటజఫలే కళింగా యోషితి స్మృతా, | కళింగః—(పు) నెమిలియడుగు చెట్టు, మూకటిమూగపక్షి, కళింగ దేశము, కళింగం—(న) కొడిశపండు కళింగా—(స్త్రీ) కళింగదేశ స్త్రీ. |
| కాళింగో భూమికర్కారౌ దంతావళభుజంగయోః. కాళింగీ రాజకర్కట్యాం | కాళింగః—(పు) నేలగుమ్మడిచెట్టు, ఏనుఁగు, సర్పము. కాళింగీ—(స్త్రీ) నక్కదోసతీఁగె. [నది. |
| ధారంగః ఖడ్గతీర్థయోః, | ధారాంగః—(పు) కత్తి, తీర్థము పుణ్య |
| అపాంగమంగహీనే స్యాన్నేత్రాంతే తిలకేఽపిచ. ౪౪. | అపాంగం—(న) అవయవములు లేనిది. అపాంగః—(పు) నేత్రాంతము, తిలకము. |
| వరాంగం యోని మాతంగ మస్తకేషు గుడత్వచి, | వరాంగం—(న) యోని, ఏనుఁగు, తల, లవంగపుచెట్టు. |

పత్రాంగం పద్మకే భూర్జే పత్రాంగం రక్తచందనే.

పత్రాంగం—(న) ఏనుఁగు శరీరముమీఁది మచ్చలు, భుజపత్రి చెట్టు, ఎఱ్ఱచందనము.

రథాంగ శ్చక్రవాకేఽపి రథాంగం చక్ర ఇష్యతే,

రథాంగః—(పు) చక్రవాకపక్షి, రథాంగం— (న) బండి మున్నగువాని చక్రము.

రక్తాంగం విద్రుమే భౌమే విద్యాత్కాంపిల్లధీగయోః. ౨౭. రక్తాంగశ్చాపి జీవంతాం

రక్తాంగం—(న) పగడము, రక్తాంగః—(పు) అంగారకుఁడు—(న) కాంపిల్యమనునోషధి, కుంకుమ, పాలకూరచెట్టు.

మాతంగ శ్శ్వపచే గజే,

మాతంగః—(పు) మాదిగవాఁడు, ఏనుఁగు.

హేమాఙ్గో ద్రుహిణే తార్క్ష్యే

హేమాంగః—(పు) బ్రహ్మ, గరుత్మంతుఁడు.

నారంగం పిప్పలీరసే. ౨౮. నాగరంగే విటే జంతౌ యమజేఽపి ప్రకీర్తితం,

నారంగం—(న) పిప్పలిరసము, నారంగః (పు) నారింజచెట్టు, విటుఁడు, ప్రాణి, కవలపిల్లలు.

సారంగ శ్చాతకే భృంగే కురంగే చ మతంగజే. ౨౯. పక్షిభేదే చ సారంగస్సారంగశ్శబలేన్యవత్,

సారంగః—(పు) వానకోయిల, తుమ్మెద, లేడి, ఏనుఁగు, పక్షివిశేషము, (కోకిల) (త్రి) శబలవర్ణము.

ప్రియంగుః ఫలినీ కంగు పిప్పలీ రాజికాసుచ. ౩౦.

ప్రియంగుః— (పు) ప్రేంకణపుఁ జెట్టు, కొఱ్ఱలు, పిప్పలిచెట్టు, నల్లావాలు.

నీలాంగుః కృమిభేదేస్యా ద్భ్రమరాళీముసారయోః,

నీలంగుః— (పు) కీటకభేదము, తుమ్మెదల గుంపు, ఇంద్రనీలమణి.

తురంగీ చాశ్వగంధాయాం తురంగ శ్చిత్తవాజినోః.

తురంగీ—(స్త్రీ) పెన్నేరుగడ్డ, తురంగః— (పు) మనస్సు, గుఱ్ఱము.

చక్రాంగీ కటురోహిణ్యాం చక్రాంగో మానసౌకసి.

చక్రాంగీ—(స్త్రీ) కటుకరోహిణి, చక్రాంగః—(పు) హంస.

| అథ గాంత శ్చతుర్వర్ణః. | గాంత చతుర్వర్ణము. |
|---|---|
| ఈహామృగో వృకే జంతౌ ప్రభేదే రూపకస్యచ. ౫౨. | ఈహామృగః—(పు) తోఁడేలు, జంతువు, నాటకవిశేషము. |
| మల్లనాగోఽభ్రమాతంగే వాత్స్యాయనమునావపి, | మల్లనాగః—(పు) ఐరావతము, వాత్స్యాయనముని. |
| ఉపరాగః పరీవాదే రాహు గ్రస్తార్క-చంద్రయోః ౫౩. దుర్నయే గ్రహ కల్లోలేఽ | ఉపరాగః—(పు) నిందించుట, చంద్రసూర్యుల రాహుగ్రహణము, అవినీతి, గ్రహకల్లోలము. |
| పవర్గస్త్యాగమోక్షయోః, క్రియావసానసాఫల్యేఽప్యపవర్గః ప్రయుజ్యతే. | అపవర్గః—(పు) విడిచిపెట్టుట, ముక్తి, పనిచేసినపిదపఁ బొందుఫలము. |
| ఉపవర్గః స్మృతో రోగభేదో పప్లవయోరపి, | ఉపవర్గః—(పు) రోగవిశేషము, ఉపద్రవము. |
| సమాయోగస్తు సంయోగే సమవాయే ప్రయోజనే. | సమాయోగః—(పు) కలిసికొనుట, సమూహము, ప్రయోజనము. |
| సంప్రయోగం రతే విద్యా దన్వితా కార్మణేఽపి చ, | సంప్రయోగః—(పు) సంభోగము, సంబంధము, మూలికలతోఁ జేయు స్తంభనము, మోహనాదులు. |
| దీర్ఘాధ్వగః శృంఖలకే లేఖహారేతు భేదవ్యవత్. ౫౬. | దీర్ఘాధ్వగః—(పు) ఒంటె—(త్రి) జాబులు తెచ్చువాఁడు. |
| అభిషంగస్తు శపథే స్యా దాక్రోశే పరాభవే, | అభిషంగః—(పు) ప్రతిజ్ఞచేయుట, తిట్టుట, తిరస్కారముచేయుట. |
| ఛత్రభంగోఽపివైధవ్యే స్వాతంత్ర్యేనృపనాశయోః. | ఛత్రభంగః—(పు) భర్తగతింపఁ ముండమోయుట, స్వాతంత్ర్యము, ప్రభునాశనము. |
| కటభంగస్తు సస్యానాం హస్తచ్ఛేదే నృపాత్యయే, | కటభంగః—(పు) హస్తప్రమాణముగాఁ బైరులు కోయుట, ప్రభునాశనము. |

అథ గాంత పంచవర్ణః. — గాంత పంచవర్ణము.

కథాప్రసంగో వాతూలే విష వైద్యే చ వాచ్యవత్, — కథాప్రసంగః—(పు) వాయుసమూహము, విషవైద్యుఁడు.

నాడీతరంగః కాకోలే హిండకే రతహిండకే. — నాడీతరంగః—(పు) సంచరించుచుండు వాఁడు, నల్లకాకి, విటుఁడు.

---

అథ ఘాంత ఏకవర్ణః. — ఘాంత ఏకవర్ణము.

ఘో ఘుర్ఘురేచ ఘంటాయాం కాంచికా ఘాతయోరపి, — ఘః—(పు) గ్రుడ్లగూబ, గంట, ఘా—(స్త్రీ) మొలనూలు, దెబ్బ.

---

అథ ఘాంతో ద్వివర్ణః. — ఘాంత ద్వివర్ణము.

అఘంతు వ్యసనే ప్రోక్తమఘం పాతకదుఃఖయోః. ౧. — అఘం—(న) దాత్ర్యాదులవలని శ్రమము, పాపము, దుఃఖము.

అర్ఘః పూజావిధౌ మూల్యే — అర్ఘః—(పు) పూజావిధి, వెల.

అంఘ్రిః పాదద్రుమూలయోః, — అంఘ్రిః—(పు) పాదము, చెట్టువేరు.

ఓఘో బృందే పయోవేగే ద్రుతనృత్యోపదేశయోః. ౨. ఓఘః పరంపరాయాంచ — ఓఘః—(పు) బృందము, నీటిప్రవాహము, తొందరగా నాట్యము గావించుట, మంత్రాదులు చెప్పుట, వరుసగానుండుట.

మేఘ స్స్యాన్ముస్తకే ఘనే, — మేఘః—(పు) తుంగముస్తె, మబ్బు.

లఘుర్మనోజ్ఞనిస్సారా గురుషుప్రభృతౌ లఘు. ౩. కృష్ణాగురుణి శీఘ్రేచ స్పృక్కాయాం చ స్మృతో లఘుః, — లఘుః—(త్రి) మనోహరమైనది, నిస్సారమైనది, నీచమైనది, లఘు—(న) కృష్ణాగురు, శీఘ్రము. లఘూ—(స్త్రీ) స్పృక్కయనెడు గ్రంథ్యవిశేషము.

ఉద్ఘస్స్యాత్పావకే హస్తపుటకే దేహజానిలే. ౪. — ఉద్ఘః—(పు) అగ్ని, అఱచేయి, దేహమునందలి వాయువు.

మోఘోఽపి పాటలాయాం స్యాన్మోఘో నిష్ఫలహీనయోః, — మోఘా—(పు) పాటలవృక్షము, (త్రి) నిష్ఫలమైనది, దైన్యముగలది.

మఘామఘీచ నక్షత్రే భేషజే మఘా—(స్త్రీ) మఘానక్షత్రము, మఘీ—
చ యథాక్రమం. ౫. (స్త్రీ) ఓషధీవిశేషము.
శ్లాఘా మతా ప్రశంసాయాం శ్లాఘా—(స్త్రీ) స్తుతి, పరిచారకము, కో
పరిచర్యాభిలాషయోః, రిక.

---

అథ ఘాంత త్రివర్ణః. ఘాంత త్రివర్ణము.

అనఘో నిర్మలాపాప మనో అనఘః—(త్రి) స్వచ్ఛమైనది, నిర్దుష్టమై
జ్ఞే ష్వభిధేయవత్. ౬. నది, మనోహరమైనది, పాపరహితుడు
ఫలిఘః కాచకలశఘటప్రాకా ఫలిఘః—(పు) గాజుపాత్రము, మంటి
రగోపురే, కుండ, ప్రాకారము, వెలివాకిలి.
పరిఘో యోగభేదే స్యాన్మ పరిఘః—(పు) పంచాంగయోగములలో
ద్గరేఽర్గళఘాతయోః. ౭. బందొమ్మిదవది ఆయుధము, అడ్డుకఱ్ఱ,
హింస.
ప్రతిఘః ప్రతిఘాతే చ రో ప్రతిఘః—(పు) మారణము, క్రోధము.
షేచ ప్రతిఘోమతః,
కాచిఘః కాంచనేప్రోక్తోఽన్న కాచిఘః—(పు) బంగారము, తండ్రి లేని
మండే మూషకేఽపిచ. ౮. వాడు, ఎలుక.
మహార్ఘస్తు మహామూల్యే మహార్ఘః—(పు) గొప్పవిల్లు, లావకపిట్ట.
తథా లావకపక్షిణి,
నిదాఘో గ్రీష్మకాలే స్యా నిదాఘః—(పు) గ్రీష్మరుతువు, వేడిమి,
దుష్ణస్వేదాంబునోరపి. ౯. చెమట.
ఉల్లాఘస్తు శుచౌ హృష్టే ద ఉల్లాఘః—(త్రి) శుచియైనది, సంతోషించి
క్షే నీరోగయోరపి, నది, సమర్థమైనది, రోగములేనిది.
సర్వౌఘో గురువేగార్థసర్వ సర్వౌఘః—(పు) మిగులవేగము, సైన్య
సన్నహనార్థయోః. ౧౦. మంతయు యుద్ధముజేయుట కాయిత
మగుట.
అమోఘ స్సఫలే ఽమోఘా అమోఘః—(త్రి) సఫలమైనది, అమో
విడంగాభయయో స్మృ ఘా—(స్త్రీ) వాయువిడంగము, కరక
తా, చెట్టు.

---

| అథ చాంతో ద్వివర్ణః. | చాంత ద్వివర్ణము. |
| --- | --- |
| కచః క్లేశే గురోః పుత్త్రే బంధే శుష్కవ్రణే కచః, కచా కరిణ్యాం | కచః—(పు) జుట్టు, బృహస్పతికుమారుఁడు బంధము, ఎండినకురుపు, కచా—(స్త్రీ) ఆఁడయేనుఁగు. |
| కాచస్తు మణౌ శిక్యే మృదంతరే. ౧. నేత్రరోగే ఽపి | కాచః—(పు) గాజురాయి, ఉట్టి, ఒకవిధమగుమట్టి, నేత్రరోగవిశేషము. |
| నీచస్తు వామనే పామరస్స్మృతః, | నీచః—(పు) పొట్టివాఁడు, తుచ్ఛుఁడు. |
| మోచశ్శోభాంజనే ప్రోక్తో మోచా శాల్మలి రంభయోః. ౨ | మోచః—(పు) మునగచెట్టు, మోచా—(స్త్రీ) అరఁటిచెట్టు, బూరుగుచెట్టు. |
| పిచుస్తూలే చ కర్షే చ కుష్ఠరోగే ఽసురాంతరే, భైరవస్య ప్రభేదే చ పిచుః క్వాపి ప్రకీర్తితః. ౩. | పిచుః—(పు) దూది, తాండ్రచెట్టు, కుష్ఠరోగము, పిచుఁడను రాక్షసుఁడు, భైరవుఁడు. |
| కూర్చో వికత్థనే మధ్యే భ్రువోశ్శ్మశ్రుణి కైతవే, | కూర్చః—(పు) కపటము, కనుబొమ్మల మధ్యభాగము, మీసము, గడ్డము, నెపము. |
| క్రౌంచః ఖగనగద్వీపప్రభేదేషు ప్రయుజ్యతే. ౪. | క్రౌంచః—(పు) క్రౌంచపక్షి, క్రౌంచపర్వతము, క్రౌంచద్వీపము. |
| చంచో నలాది నిర్మాణే చంచా తు తృణపూరుషే, | చంచః—(పు) అగ్నికుండమునకుఁ దోలుచుట, చంచా—(స్త్రీ) వెఱబొమ్మ. |
| చంచుః పంచాంగులే త్రోట్యాం గోనాడీకే ఽపి పఠ్యతే. ౫. | చంచుః—(పు) ఆముదపుఁజెట్టు, పక్షిముక్కు, శాకవిశేషము. |
| శుచి శ్శుద్ధే ఽనుపహతే శ్రృంగారాషాఢయో స్సితే, గ్రీష్మే హుతవహే ఽపి స్యా దుపధాశుద్ధమం | శుచిః—(త్రి) పరిశుద్ధమైనది, కొట్టఁబడనిది—(పు) శృంగారరసము, ఆషాఢమాసము, తెల్లరంగు, గ్రీష్మర్తువు, అగ్నిహోత్రము, యుక్తాయుక్త |

త్రిణి. ౬. మెఱంగిన యోగ్యుఁడగుమంత్రి.

రుచి ర్మయూఖే శోభాయా రుచిః—(స్త్రీ) కిరణము, కాంతి, అత్యా మభిష్వంగాభిలాషయోః, సక్తి, కోరిక.

వీచి స్స్వల్పే తరంగే స్యా దవ వీచిః—(స్త్రీ) స్వల్పము, తరంగము, అవ కాశే సుఖేఽపి చ. ౭ కాశము, సౌఖ్యము.

సూచిః కరాద్యభినయే నారీ సూచిః—(స్త్రీ) అభినయమునందలి హస్త ణాం కరణాంతరే, (కేతకీ విశేషము, స్త్రీలచేయు అవయవ ముకుళాగ్రేఽపి సూచిః విశేషము [మొగలిమొగ్గకొనమీఁది క్వాపి ప్రదర్శితః) సూచీ ముల్లు ఇది పాఠాంతరము.] సూది. తు సీవనద్రవ్యే

శచీంద్రాణ్యాం శతావరౌ.౮. శచీ—(స్త్రీ) ఇంద్రుని భార్య, పిల్లిపీచర.

కాంచీస్యా న్మేఖలా దామ్ని కాంచీ—(స్త్రీ) మొలనూలు, గురిగింజ గుంజాయాంనీవృదంతరే, తీఁగ, కాంచీనగరము.

వచాస్యా దుగ్రగంధాయాం వచా—(స్త్రీ) నల్లవస, గోరువంక పక్షి, వచ సారికాయాం శుకేవచః. —(పు) చిలుక.

అర్చా పూజా ప్రతిమయో అర్చా—(స్త్రీ) పూజ, విగ్రహము.

శ్చర్చా స్థాసకచింతయోః, చ చర్చా—(స్త్రీ)చందనాదులఁ బూసికొనుట, ర్చికాయాం చ విచారణము, పార్వతీదేవి.

రుక్శోభా కిరణేచ్ఛాసు చే రుక్—(స్త్రీ) కాంతి, కిరణము, కోరిక. ష్యతే. ౧౦. [పు) చెట్టు

త్వక్చర్మవల్కయో స్త్వచే త్వక్—(స్త్రీ) చర్మము, నారచట్ట, లవంగ

న్యఙ్ఙీచేనిమ్నకార్ణ్యయోః, న్యఙ్—(త్రి) నీచమైనది, కల్లరివాఁడు, గుబిలి.

వాగ్వచనే సరస్వత్యాం భా వాక్—(స్త్రీ) భాషా, గీః, భారతీ శబ్ద షాగీర్భారతీయథా. ౧౧. ములవలెమాట, సరస్వతి.

అథ చాంత స్త్రివర్ణః. చాంత త్రివర్ణము.

కవచో గర్దభాండే స్యా త్స కవచః—(పు) కలుజువ్విచెట్టు, కవచము, న్నాహే పటహేఽపిచ, నగారా.

వికచః క్షపణే కేతుగ్రహేచ వికచః—(పు) క్షపణమతస్థుఁడు, కేతువను

| | |
|---|---|
| స్ఫుటి తేఽన్యవత్ ౧౨. | గ్రహము, (త్రి) వికసించినది. |
| క్రకచః కరపత్రే స్యాద్గ్రంథి లాఖ్యద్రుమేఽపిచ, | క్రకచః—(పు) అంపము, వెణుతురుచెట్టు. |
| సంకోచమపి కాశ్మీరే సంకోచో మీనబంధయోః. | సంకోచం—(న) కుంకుమ, సంకోచః—(పు) చేప, బంధించుట. |
| నారాచో లోహబాణేస్యాన్నారాచో జలహస్తిని, నారాచ్యేషణికాయాంచ | నారాచః—(పు) లోహముతోఁ జేసిన బాణము, నీటియేనుఁగు, నారాచీ—(స్త్రీ) శాణము. |
| సమ్య క్సమ్మతహృద్యయోః. | సమ్యక్—(త్రి) కూడుకొన్నది, మనోహరమైనది. |
| ప్రపంచ స్సంచయే ప్రోక్తో విస్తారే చ ప్రతారణే, | ప్రపంచః—(పు) సమూహము, విస్తారము, వంచనము |
| మరీచిః కృపణే దీప్తౌ ఋషిభేద మయూఖయోః. ౧౫. | మరీచిః—(పు) లోభి, ప్రకాశము, మరీచిముని, (కశ్యపమహర్షి తండ్రి)—(పు) కిరణము. |
| మారీచో రక్షసోభేదే కక్కోలే యాజకద్విజే, | మారీచః—(పు) మారీచాసురుఁడు, మిర్యాలు, యజ్ఞముచేయించు బ్రాహ్మణుఁడు. |
| మారీచీ దేవతాభేదే | మారీచీ—(స్త్రీ) వజ్రకాళియనుశక్తి. |
| నముచిస్స్మరదైత్యయోః. | నముచిః—(పు) మన్మథుఁడు, రాక్షసుఁడు. |
| కనీచిః పుష్పితలతా గుంజయో శ్శకటేఽపిచ, | కనీచిః—(పు) పూలుపూసినతీఁగ, గురువెందతీఁగ, బండి |
| అవీచి ర్నరకానూర్మ్యో | [లేని నీరు. అవీచిః—(పు) నరకవిశేషము, తరంగము |
| ర్విపంచీ కేళివీణయోః. ౧౬. | విపంచీ—(స్త్రీ) క్రీడ, వీణ. |

| చాంత శ్చతుర్వర్ణః. | చాంత చతుర్వర్ణము. |
|---|---|
| మలిమ్లుచోఽనిలే చోరే | మలిమ్లుచః—(పు) వాయువు, దొంగ. |
| జలసూచి ర్జలౌకసి, శృంగాటే శింశుమారేచ కంకే శేటి ఝషేఽపి చ ౧౭. | జలసూచిః—(స్త్రీ) జలగ—(పు) నాలుగు వీథులు కలియుచోటు, పడకమొసలి, కంకశేటియను మత్స్యవిశేషము. |

అథ చాంతః పంచవర్ణః. | చాంత పంచవర్ణము.

రతనారీచ ఇత్యేష కథితో ర తివల్లభే, కుక్కురే రత నారీచ స్సీత్కారే వర యోషితాం. ౧౯.

రతనారీచ—(పు) మన్మథుఁడు, కుక్క, ఉత్తమకాంతల సీత్కారము.

---

అథ ఛాంతో ద్వివర్ణః. | ఛాంత ద్వివర్ణము.

అచ్ఛ స్స్ఫటిక భల్లూక నిర్మ లేష్వచ్ఛమవ్యయం, ఆ భిముఖ్యేఽథ

అచ్ఛః—(పు) స్ఫటికమణి, ఎలుగుగొడ్డు, నిర్మలము, (అవ్య) అభిముఖమగుట.

కచ్ఛస్స్యా దనూపే తున్నక ద్రుమే. ౧. నౌకాంతే పరి ధానస్య పశ్చా దంచలప ల్లవే, కచ్ఛాతు చీరికా యాంచవా రాహ్యాంచ ని గద్యతే. ౨.

కచ్ఛః—(పు) జలప్రాయమగు నావు, నంది చెట్టు, చుక్కాని, కట్టుకొను పంచె గోచి చెఱఁగు, కచ్ఛా—(స్త్రీ) మిడుత, బ్రాహ్మి మున్నగు స [illegible] లలో నొకతె.

స్యాద్గుచ్ఛ స్తబకే స్తంభే హార భేదకలాపయోః,

గుచ్ఛః—(పు) పూలగుత్తి, గడ్డిదుబ్బు, ముప్పదిరెండు సరములము [illegible] లహా రము, పింఛము.

పుచ్ఛః పాశ్చాత్యభాగే స్యా ల్లాంగూలే పుచ్ఛమిష్య తే. ౩.

పుచ్ఛః—(పు) వెనుకభాగము, పుచ్ఛం—(న) వెనుకభాగము, తోఁక.

మ్లేచ్ఛః పాపరతే జాతిభేదే స్యా దపభాషిణి.

మ్లేచ్ఛః—(పు) పాపాత్ముఁడు, శబరపులిం దాదిజాతి, దుర్భాషణము.

పిచ్ఛాతు శాల్మలీ వేష్టే మం డే చాశ్వపదామయే. ౪. ముక్తా పూగచ్ఛటాకోశ మోచావిజయినేషుచ, పి చ్ఛః పుచ్ఛే

పిచ్ఛా—(స్త్రీ) బూరుగుబంక, గంజి, అశ్వపాదమునఁ బుట్టురోగము, వరుస, పోకచెట్టు, సమూహము, మొగ్గ, అరఁటిచెట్టు, జిడ్డుగలవస్తువు, పిచ్ఛ—(పు) తోఁక.

| | |
|---|---|
| మహాకచ్ఛ స్సముద్రే చ ప్రచేతసి. ౫. | మహాకచ్ఛః—(పు) సముద్రము, వరుణదేవుఁడు. |

| అథ జాంత ఏకవర్ణః. | జాంత ఏకవర్ణము. |
|---|---|
| జూ రాకాశే సరస్వత్యాం పిశాచ్యాం జవనేఽపి చ, | జూః—(స్త్రీ) ఆకాశము, సరస్వతి, పిశాచస్త్రీ, వేగము. |
| జో జన్యాం జాతమాత్రే చ మృత్యుంజయే జనార్దనే. | జః—(పు) జనించుట, పుట్టినది, శంకరుఁడు, విష్ణుమూర్తి. |

| అథ జాంతో ద్వివర్ణః. | జాంత ద్వివర్ణము. |
|---|---|
| కంజః కేశే విరించౌ చ కంజం పీయూషపద్మయోః, | కంజః—(పు) వెండ్రుకలు, బ్రహ్మ. కంజం-(న) అమృతము, పద్మము. |
| అజో హరౌ హరే కామే విధౌ ఛాగే రఘోస్సుతే. | అజః—(పు) విష్ణువు, శంకరుఁడు, మన్మథుఁడు, బ్రహ్మ, మేఁక, అజమహారాజు. |
| వ్రజో గోష్ఠాధ్వబృందేషు | వ్రజః—(పు) గోశాల, మార్గము, సమూహము. |
| నిజ మాత్మీయనిత్యయోః, | నిజః—(త్రి) తనకు సంబంధించినది, నిత్యమైనది. |
| ధ్వజం చిహ్నే పతాకాయాం ధ్వజ శ్శౌండికశేఫసోః. ౩. ఖట్వాంగే చ | ధ్వజం—(న) గుర్తు, జెండా. ధ్వజః—(పు) కల్లమ్ముకొని జీవించువాఁడు, శిశ్నము, ఆయుధవిశేషము. |
| స్వజం రక్తే స్వజః ప్రస్వేద పుత్రయోః, | స్వజం—(న) రక్తము. స్వజః—(పు) చెమట, కుమారుఁడు. |
| ద్విజో విప్రేఽండజే దంతే భార్గీరేణుకయో ర్ద్విజా. ౪. | ద్విజః—(పు) బ్రాహ్మణుఁడు, పక్షిసర్పాదులు, దంతము. ద్విజా—(స్త్రీ) గంటుభారంకి, రేణుకమను గ్రంథ్యము. |
| బీజం రేతసి తత్త్వే చ హేతౌ వంకురకారణే, ఆధానేఽపి చ | బీజం—(న) శుక్లము, యథార్థము, కారణము, విత్తనము, గర్భాధానము. |
| సజ్జస్స్యా త్సంనద్ధే సంభృతే | సజ్జః—(త్రి) సిద్ధమైనది, సంపాదింపఁబడినది. |

పిచ. ౫.

| | |
|---|---|
| వాజం ఘృతేఽప్సు యజ్ఞేఽ న్నే వాజో నిస్వనపక్ష యోః, వాజో జవేమునౌ వాజో | వాజం—(న) నేయి, జలము, యజ్ఞము, అన్నము. వాజః—(పు) ధ్వని, ఱెక్క, వేగము, ఒకముని. |
| వ్యాజ శ్శాఠ్యాపదేశయోః. | వ్యాజః—(పు) కపటము, నెపము. |
| భుజః పాణౌ చ బాహౌ చ | భుజః—(పు) హస్తము, బాహువు. [డు. |
| కుజస్స్యాన్నరకారయోః, | కుజః—(పు) నరకాసురుఁడు, అంగారకుఁ |
| అబ్జో ధన్వంతరౌ చంద్రే నిచుళే శంఖపద్మయోః. ౭. అబ్జం స్యా దథ | అబ్జః—(పు) ధన్వంతరి, చంద్రుఁడు, నీటి ప్రబ్బచెట్టు. అబ్జం—(న) శంఖము, పద్మము. |
| కుబ్జోఽపి న్యుబ్జే స్యా త్పాదపాంతరే, | కుబ్జః—(త్రి) గూనివాఁడు, పుష్పవృక్ష విశేషము. |
| న్యుబ్జంతు కర్మరంగేస్యా న్న్యుబ్జః ప్రోక్తః కుశస్రుచి. ౮. అధోముఖే చ కుబ్జే చ న్యుబ్జో వాచ్యవదిష్యతే, | న్యుబ్జం—(న) కర్మరంగఫలము. న్యుబ్జః—(పు) కుశవికార మగుస్రుక్కు (త్రి) తలవంచినది, గూనుది. |
| ఆజి స్సమావనౌ యుద్ధే | ఆజిః—(స్త్రీ) సమానమగు భూమి, యుద్ధము. |
| రాజిస్స్యా త్పంక్తిరేఖయోః. | రాజిః—(స్త్రీ) వరుస, గీత. |
| లాజాః స్యుర్నృస్త్రీస్తథా న్యేషు లాజస్స్యా దార్ద్రతండు లే, ఉశీరలాజముద్దిష్టం | లాజాః—(పు) నిత్యబహువచనము, పేలాలు. లాజః—(పు) తడిబియ్యము. లాజం—(న) వట్టివేరు. [జనము. |
| ప్రజా సంతానలోకయోః. | ప్రజా—(స్త్రీ) స్త్రీ, పుంరూపసంతానము, |
| గుంజాపి పటహే ప్రోక్తా కాకచించ్యాం కలధ్వనౌ, | గుంజా—(స్త్రీ) తప్పెట, పూసలగురివెంద లత, అవ్యక్తమధురధ్వని. |
| గంజా ఖనౌ సురాగేహే స్యా ద్భాండాగారరీధ యోః. ౧౧. గంజః | గంజా—(స్త్రీ) గని, కల్లుఅమ్మెడిగృహము. గంజః—(పు) బొక్కసపుటిల్లు, నివసించుట. |
| కుంజో నికుంజేఽపి హనౌ దంతే చ దంతినాం, | కుంజః—(పు) పొదరిల్లు, దవుడ, ఏనుఁగు దంతము. |

| | |
|---|---|
| సంజః ప్రజాపతౌ రుద్రే | సంజః—(పు) బ్రహ్మ, శంకరుఁడు. |
| లంజస్స్యాత్ పదకచ్ఛయోః. | లంజః—(పు) పాదము, గోచి, చెఱఁగు. |
| ఊర్జో బలే మహోత్సాహే | ఊర్జః— (పు) బలము, అధికమగు నుత్సాహ. [ము. |
| ఖజా మంథప్రహస్తయోః, | ఖజా—(స్త్రీ) కవ్వము, చాచఁబడినహస్త |
| పింజా తూలే హారిద్రాయాం | పింజా—(స్త్రీ) దూది. పసుపు—(త్రి) వ్యా |
| పింజస్తు వ్యాకులేఽన్యవత్. | కులమైనది. |
| పింజో బలే చయే పింజం | పింజః—(పు)బలముం.పింజ—(న) సమూహము. |
| రజ్జు ర్వేణ్యాం గుణేఽపిచ, | రజ్జుః—(స్త్రీ) జడ, త్రాడు. |
| ఖర్జూః కండ్వాం చ కీటే చ ఖర్జూరీ పాదపేఽపి చ. | ఖర్జూః—(స్త్రీ) దురద, పురుగు, కర్జూరపు చెట్టు. |
| మర్జూ స్స్యాద్రజకే శుద్ధౌ | మర్జూః—(పు) చాకలివాఁడు (స్త్రీ) శుద్ధి. |
| సర్జూ ర్వణిజి విద్యుతి, | సర్జూః—(పు) వర్తకుఁడు. (స్త్రీ) మెఱుపు. |

| అథ జాంత స్త్రివర్ణః. | జాంత త్రివర్ణము. |
|---|---|
| కరజస్తు కరంజే స్యా న్నఖే వ్యాఘ్రనఖేఽపి చ. ౧౫. | కరజః—(పు) కానుగుచెట్టు, గోళ్లు, వ్యాఘ్రనఖమను గంధద్రవ్యము. |
| కుటజో వృక్షభేదే స్యా దగస్త్య ద్రోణయోరపి, | కుటజః—(పు) గిరిమల్లి కావృక్షము,అవిసెచెట్టు, తుమ్మిచెట్టు. |
| సహజస్తు నిసర్గే స్యా త్సహోత్థే పునరన్యవత్. ౧౬. | సహజః—(పు) స్వభావము (త్రి) తోడఁబుట్టినది. |
| నీరజం కమలే కుష్ఠే | నీరజం—(న) పద్మము, కుష్ఠురోగము. |
| జలజం శంఖపద్మయోః, | జలజం—(న) శంఖము, తామరపూవు. |
| వలజం గోపురే క్షేత్రే సస్య సంగరయోరపి. ౧౭. వలజా వరయోషాయాం వసుమత్యామపి స్మృతా, | వలజం—(న) పురద్వారము,వరిమడి,సస్యము, యుద్ధము. వలజా—(స్త్రీ) ఉత్తమకాంత, భూమి. |
| కారుజ శ్శిల్పినాంచిత్రే కలభే నాగకేసరే. ౧౮. స్వయం | కారుజః—(పు) వఱ్ఱంగి మున్నగువారి పనితనము, ఒంటెపిల్ల, నాగకేసర |

జాతతిలే ఫేనే వల్మీకే గైరికేఽపి చ,
వృక్షము, కారునువ్వు, నురుగు, పుట్ట, ధాతువిశేషము.

**బాహుజః** క్షత్రియే కీరే స్వయం జాతతిలేఽపి చ.
బాహుజః—(పు) క్షత్రియుఁడు, చిలుక, కారునువ్వు.

వనజో ముస్తకే పద్మే వనజం వనజో గజే, వనజా ముద్గపర్ణ్యాం చ
వనజః—(పు)తుంగముస్త. వనజం—(న) పద్మము, (పు) ఏనుఁగు. వనజా—(స్త్రీ) పిల్లిపెసర.

వణిగ్వాణిజ్యజీవిని. ౨౦. వణిక్కరణభేదే చ వాణిజ్యాయా మపీష్యతే,
వణిక్—(పు) వర్తకముచే జీవనము చేయువాఁడు, పంచాంగకరణము, వర్తకముచేయుట.

సామజస్తు గజే ప్రోక్తస్సామోత్థే పునరన్యవత్. ౨౧.
సామజః—(పు) ఏనుఁగు (త్రి) సామము వలనఁ బుట్టినది.

భూమిజో నరకేఽంగారే సీతాయామపి భూమిజా,
భూమిజః—(పు) నరకాసురుఁడు, అంగారకుఁడు. భూమిజా—స్త్రీ సీత.

గిరిజం చాభ్రకే ఖ్యాతం శిలాజితు సుగంధయోః. ౨౨. లోహేఽపి గిరిజా గౌరీ మాతులుంగ్యోరుదీరితా,
గిరిజం—(న) అభ్రకము, శిలాజిత్తు, తాతపువ్వు, లోహము. గిరిజా—(స్త్రీ) పార్వతి, మాదీఫలపువృక్షము.

కంభోజో హస్తిభేదే స్యాచ్ఛంఖదేశవిశేషయోః.
కంభోజః—(పు) కాంభోజదేశపు ఏనుఁగు, శంఖము, దేశవిశేషము.

అంగజం రుధిరేఽనంగే రోమ్ణి పుత్రే మతోఽంగజః,
అంగజం—(న) నెత్తురు. అంగజః—(పు) మన్మథుఁడు, రోమములు, కుమారుఁడు.

కాంభోజ స్తురగే సోమవల్కే పున్నాగపాదపే.
కాంభోజః—(పు) కాంభోజదేశపు గుఱ్ఱము, చంద్రచెట్టు, పొన్నచెట్టు.

కాంభోజీ మాషపర్ణ్యాం చ హింగుపర్ణ్యామపిక్వచిత్,
కాంభోజీ—(స్త్రీ) కారుమినుము, వృక్షవిశేషము.

అండజః కృకలాసే స్యాత్ఖగే మీన భుజంగయోః ౨౩. కస్తూర్యామండజా ప్రోక్తా
అండజః—(పు) తొండ, పక్షి, చేఁప, సర్పము. అండజా—(స్త్రీ) కస్తూరి.

| | |
|---|---|
| పరంజ స్తైలయంత్రకే, ఫేనే పరంజః—(పు) నూనెగానుగ, నురుగు, చ కరవాలే చ పరంజం తురికాఫలే. ౨౬. | పెద్దకత్తి. పరంజం—(న)బఱ్ఱింకిపండు. |
| హిమజాపి నదీ గౌర్యో స్త్రె నాకే హిమజః స్మృతః, | హిమజా—(స్త్రీ) గంగ, పార్వతి హిమజః —(పు) మైనాకపర్వతము. |

అథ జాంత శ్చతుర్వర్ణః. / జాంత చతుర్వర్ణము.

| | |
|---|---|
| జఘన్యజోఽనుజే శూద్రే | జఘన్యజః—(పు) తమ్ముఁడు, శూద్రుఁడు. |
| భారద్వాజః స్మృతో మునౌ. ౨౭. ద్రోణే చ వనకార్పాస్యాం భారద్వాజీతి కథ్యతే, భారతాజో గురోః పుత్రే వ్యాఘ్రాటాఖ్యవిహంగమే. ౨౮. | భారద్వాజః— (పు) భారద్వాజముని, ద్రోణాచార్యుఁడు. భారద్వాజీ—(ఈ. స్త్రీ) అడవిప్రత్తిచెట్టు (పు) బృహస్పతికుమారుఁడు, ఏట్రింతపక్షి. |
| కాశ్మీరజా ఖ్యాతివిషా కుష్ఠ కుంకుమపౌష్కరే, | కాశ్మీరజా—(స్త్రీ) అతివస. కాశ్మీరజం—(న) కుష్ఠురోగము, కుంకుమపువ్వు, పుష్కరపూల మనుగంధ్యము. |
| క్షీరాబ్ధిజం తు సాముద్రలవణే మౌక్తికేఽమృతే, ౨౯. క్షీరాబ్ధిజా శ్రియాం ప్రోక్తా చంద్రే క్షీరాబ్ధిజో భవేత్, | క్షీరాబ్ధిజం—(న) సముద్రలవణము, ముత్యము,అమృతము. క్షీరాబ్ధిజా—(స్త్రీ) లక్ష్మి. క్షీరాబ్ధిజః—(పు) చంద్రుఁడు. |
| ద్విజరాజ శ్శశధరే సుపర్ణేఽనంతభోగిని. ౩౦. | ద్విజరాజః—(పు)చంద్రుఁడు, గరుత్మంతుఁడు, శేషువు. |
| ధర్మరాజో యమే బుద్ధే ధర్మరాజో యుధిష్ఠిరే, | ధర్మరాజః—(పు) యముఁడు, బుద్ధదేవుఁడు, ధర్మరాజు (పాండవేయుఁడు). |
| రాజరాజః కుబేరేఽపి సార్వభౌమే సుధాకరే. ౩౧. | రాజరాజః—(పు) కుబేరుఁడు, సమస్తభూమిని బాలించువాఁడు, చంద్రుఁడు |
| భృంగరాజస్తు మధుపే మార్కవే విహగాంతరే, | భృంగరాజః—(పు) తుమ్మెద, గుంటగలగరచెట్టు, కూఁకటిమూఁగపిట్ట. |

| | |
|---|---|
| గ్రహరాజో రవౌ చంద్రే౽ప్యహిభుక్కేకితార్క్ష్యయోః. యక్షరాట్ త్ర్యంబకసఖే మల్లానాం రంగచత్వరే, | గ్రహరాజః—(పు) సూర్యుఁడు, చంద్రుఁడు. అహిభుక్—(పు) నెమిలి, గరుత్మంతుఁడు. యక్షరాట్—(పు) కుబేరుఁడు, గరిడి చేయునట్టి ప్రదేశము. |

---

| అథ జాంతః పంచవర్ణః. | జాంత పంచవర్ణము. |
|---|---|
| మునిభేషజమాగస్త్యే హరీతక్యాం చ లంఘనే. ౩౩. | మునిభేషజం—(న) అవిసెనూనె, కరక్కాయచెట్టు, దాటుట. |
| వృషభధ్వజశబ్దో౽సౌ శంకరే చార్హ్వదంతరే, | వృషభధ్వజః—(పు) శివుఁడు, బుద్ధవిశేషుఁడు. |

---

| అథ ఝాంతవర్ణః. | ఝాంతవర్ణము. |
|---|---|
| ఝంఝాధ్వనివిశేషే౽పి ఝంఝాల్ప జలవర్షణే, (ఝంఝా చాఘోరసంరావవృష్టి సంయుక్తమారుతే). ఝంఝావాతే తారవాయానష్టే౽పి పరికీర్తితా. | ఝంఝా—(స్త్రీ) ధ్వనివిశేషము, తుషారవర్షము, వాయువు, (మిగుల గొప్ప గాలి,) గొప్పధ్వని, నష్టము. (కుండలీకరణములోనివి అధికపాఠము.) |

---

| అథ జ్ఞాంతవర్ణః. | జ్ఞాంతవర్ణము. |
|---|---|
| జ్ఞో విరించే బుధే సౌమ్యే | జ్ఞః—(పు) బ్రహ్మ, పండితుఁడు, బుధగ్రహము. |
| చాజ్ఞస్తు జడమూర్ఖయోః, | అజ్ఞః—(పు) మందమతి, బుద్ధిహీనుఁడు. |
| ప్రజ్ఞా బుద్ధౌ పండితే౽పి ప్రజ్ఞో వాచ్యవదిష్యతే. ౧ | ప్రజ్ఞా—(స్త్రీ) బుద్ధి (త్రి) పండితుఁడు. |
| సంజ్ఞా నామని గాయత్ర్యాం చేతనాయాం రవిస్త్రియాం, అర్థసూచనికాయాం చ హస్తాద్యైరపి కథ్యతే. ౨. | సంజ్ఞా—(స్త్రీ) పేరు, గాయత్రి, జ్ఞానము, సూర్యునిభార్య, హస్తాదివిన్యాసముల చేత మనోగతభావము తెలుపుట. |

| | |
|---|---|
| ప్రాజ్ఞావిదుష్యాంయువత్యాం ప్రాజ్ఞీ ప్రజ్ఞాయుతస్త్రియాం, | ప్రాజ్ఞా—(స్త్రీ) విద్వాంసురాలు. ప్రాజ్ఞీ—(స్త్రీ) ప్రజ్ఞావంతురాలగు కాంత. |
| సర్వజ్ఞ శ్శంకరే బుద్ధే కృతజ్ఞః కుక్కురేఽపి చ. ౩. | సర్వజ్ఞః—(పు) శంకరుఁడు, బుద్ధదేవుఁడు. కృతజ్ఞః—(పు) కుక్క, మేలుమఱువనివాఁడు. |
| దైవజ్ఞో గణకేఽపి స్యాత్ క్షేత్రజ్ఞ శ్ఛేకఆత్మని. | దైవజ్ఞః—(పు) జ్యోతిష్కుఁడు, జ్ఞాని. క్షేత్రజ్ఞః—(పు) పెంపుడు మృగపక్ష్యాదులు, ఆత్మ. |

అథ టాంతో ద్వివర్ణః. — టాంత ద్వివర్ణము.

| | |
|---|---|
| కటః శ్రోణౌ క్రియాకారేఽలింజేఽతిశయే శవే, సమయే గజగండే చ పిప్పల్యాంచ కటీ మతా. ౧. | కటః—(పు) పిఱుఁదులు, పనిచేయువాఁడు, చేఁప, అతిశయము, శవము, సమయము, ఏనుఁగుగండస్థలము. కటీ—(స్త్రీ) పిప్పళ్లు. |
| ఖటోంధకూపకఫయోః ప్రహారాంతరటంకయోః, | ఖటః—(పు) మిగుల లోఁతుగలబావి, శ్లేష్మము, ఆయుధవిశేషము, రాళ్లమలిచెడుఉలి. |
| భటః పామరభేదే చ వీరే చ ప్రగుణే భటః. ౨. | భటః—(పు) తుచ్ఛుఁడు, యుద్ధభటుఁడు, యోగ్యుఁడు. |
| ఘటస్సమాధిభేదేభ శిరఃకూటకుంభేషు చ, ఘటాఘటన గోష్ఠీభ ఘటనాసుచ దృశ్యతే. ౩. | ఘటః—(పు) కుంభకమనుసమాధి, ఏనుఁగుశిరోగ్రము, కడవ. ఘటా—(స్త్రీ) కూర్పుట, సభ, సంగ్రామమున నేనుఁగుగుంపులఁ బ్రోగుఁజేయుట. |
| కుటః కోటే ఘటే గేహే శిలాకుట్టకపూరుషే, | కుటః—(పు) కోట, కడవ, గృహము, రాళ్లుమలచువాఁడు. |
| స్యాత్కుటీ కుంభదాస్యాంచ మురాయాం చిత్రగుచ్ఛకే. ౪. | కుటీ—(స్త్రీ) నీళ్లుమోయు స్త్రీ, మురయనుగంధద్రవ్యము, వివిధవర్ణముల పూలగుత్తి. |

| | |
|---|---|
| పటః ప్రియాలవృక్షే చ సుచే<br>లే చ పురస్కృతౌ, | పటః—(పు) మొరళిచెట్టు, మంచివలువ<br>ముందుగానుంచుట. |
| లటః ప్రమాదవచన దోష<br>యో రప్యుదాహృతః. ౫. | లటః—(పు) పొరపాటుమాట, దోషము. |
| వటో గోళే గుళే భక్ష్యే వట<br>స్సామ్యవరాటయోః, వ<br>టః కపర్దే న్యగ్రోధే శుల్బ<br>రక్తికయోర్వటీ. ౬. | వటః—(పు) ఉండ, బెల్లము, భక్ష్యవిశే<br>షము, సామ్యము, గవ్వ, శివునిజటా<br>జూటము, మఱ్ఱిచెట్టు. వటీ —(స్త్రీ) దార<br>ము, గురుగింజపూస. |
| విటోఽద్రౌ లవణే షిద్గేమూ<br>షకే ఖదిరేఽపి చ, | విటః—(పు) పర్వతము, ఉప్పు, విటుఁడు,<br>ఎలుక, చండ్రచెట్టు. |
| స్ఫుటో వ్యక్తే ప్రఫుల్లే చ వ్యా<br>ప్తే చ కలితేఽన్యవత్. ౭. | స్ఫుటః—(త్రి) స్పష్టమైనది, వికసించినది,<br>విస్తరించినది, కూడుకున్నది. |
| నిర్భిన్నకర్కటీసస్యే పాదస్ఫో<br>టే స్ఫుటిర్మతా, | స్ఫుటిః—(స్త్రీ) కోయఁబడిన దోసపండు,<br>కాలిబొబ్బరోగము. |
| కూటం యన్త్రేఽనృతే రా<br>శౌ నిశ్చలే లోహముద్గరే<br>౮. మాయాద్రి శృంగ<br>యోస్తుచ్ఛే సీరావయవ<br>దంభయోః, పురద్వారే చ<br>శంసంతి | కూటం—(న) యంత్రవిశేషము, అసత్య<br>ము, ధాన్యాదులరాశి, కదలకుండుట,<br>ఇనుపగుదియ, మాయ, పర్వతశృం<br>గము, నీచమైనది, నాగటికఱ్ఱు,<br>దంభము, పట్టణద్వారము. |
| లాటో దేశాంతరే శుకే. ౯ | లాటః—(పు) లాటదేశము, చిలుక. |
| ఝాటో నికుంజే కాంతారే<br>వ్రణసంమార్జనేఽపి చ, | ఝాటః—(పు) పొదరిల్లు, అడవి, గాయ<br>ము తుడుచుకొనుట. |
| వాటో వృతౌ చ మార్గే చ<br>వాటీతు గృహనిష్కుటే. | వాటః—(పు) కంచెకోట, మార్గము.<br>వాటీ—(స్త్రీ) గృహోద్యానము. |
| చటు శ్చాటౌ పిచండే చ వ్రతి<br>నామాసనాంతరే, | చటుః—(పు) ప్రియవాక్యము, ఉదరము,<br>యోగుల ఆసనవిశేషము. |
| కటు స్సుగంధే తీక్ష్ణే స్యాద<br>కార్యే మత్సరేఽప్రియే.<br>౧౧. కటుః ప్రియంగు | కటుః—(త్రి) మంచివాసనగలది, తీవ్రమై<br>నది, దుష్కార్యము, తీక్ష్ణక్రోధము,<br>అనిష్టము. కటుః—(స్త్రీ) ప్రేంకణపు |

కటుకా రాజికా స్వథ దూషణే, కటుప్రోక్తం | కటుకరోహిణి, నల్లావాలు. కటుం—(న) దూషించుట.

పటు స్తీక్ష్ణే నీరోగేచతురేఽన్యవత్. ౧౨. పటుఃపటోల పత్రేఽపి ఛత్రాలవణయోః పటుః, | పటుః—(త్రి) వాఁడియైనది, రోగములేనివాఁడు. నేర్పరి—(పు) చేదుపొట్లచెట్టు, సదాప చెట్టు, లవణము.

ఖేటః కఫేగ్రామభేదే నిందితే చ సునందకే. ౧౩. | ఖేటః—(పు) శ్లేష్మము, పల్లెగ్రామము—(త్రి) తుచ్ఛమైనది, బలరాముని గదాయుధము.

అట్టం భక్తేచ శుష్కేచ త్వౌమేత్యర్థే గృహాంతరే, | అట్టం—(న) అన్నము—(త్రి) ఎండినది. అట్టః—(పు) పట్టుబట్ట, అతిశయము, కోటమీఁది సావిడి.

పట్టః పేషణపాషాణే వ్రణాదీనాంచ బంధనే.౧౪. చతుష్పథేచ రాజాది శాసనాంతర పీఠయోః, | పట్టః—(పు) సన్నెకల్లు, గాయములకు వేయుపట్టి, నాలుగుత్రోవలు కలియుచోటు, దానపత్రము మొదలగు రాజశాసనములు, పీఠము.

పట్టీ లలాటభూషాయాం పట్టీ లాక్షాప్రసాదనే.౧౫. | పట్టీ—(స్త్రీ) ఫాలాలంకారవిశేషము. పట్టిః—(పు) ఎఱ్ఱలొద్దుగుచెట్టు.

క్రుష్టం చ రోదనే రావే | క్రుష్టం—(న) ఏడ్చుట, ధ్వని.

కష్టంగహనకృచ్ఛ్రయోః, | కష్టం—(న) అడవి, కష్టము

ఇష్టమాశంసితే పూజ్యతమే ప్రయతమేన్యవత్. ఇష్టంసంస్కారయోగేచ యాగేచ క్రతుకర్మణి, | ఇష్టం—(త్రి) చెప్పఁబడినది, పూజింపఁదగినది. ఇష్టమైనది—(న) యజ్ఞమునందు సంస్కరించుట, యజ్ఞము, హోమాది కర్మ

రిష్టం క్షేమా శుభాభావకృపాణేషు ప్రయుజ్యతే. | రిష్టం—(న) క్షేమము, అమంగళము, లేకపోవుట, పెద్దఖడ్గము.

క్లిష్టమవ్యక్తవాచిస్యాత్ క్లిష్టం మ్లానే న్యవన్మతం, | క్లిష్టం—(న) స్పష్టముకానివాక్యము—(త్రి) వాడిపోయినది.

దిష్టం దైవేచ కాలేస్యాద్దిష్ట | దిష్టం—దైవము. దిష్టః—(పు) కాలము.

| | |
|---|---|
| సృష్టం తు నిర్మితే. ౧౮. యుక్తనిశ్చిత్తయోః ప్రాజ్యే | సృష్టం—(త్రి) సృజింపఁబడినది, కూడుకొన్నది, నిశ్చయింపఁబడినది, విస్తారమైనది. |
| హృష్టోహృషి తవన్మతః, రోమాంచితే ప్రహసితే జాతహర్షేచ విస్మితే. ౧౯ | హృష్టః—(త్రి) హృషితశబ్దమువలె సంతోషమొందినవాఁడు, గగుర్పాటొందినవాఁడు, నవ్వినవాఁడు, సంతోషమొందినవాఁడు, ఆశ్చర్యమొందినవాఁడు. |
| వ్యుష్టం దినే ప్రభాతేచ ఫలే పర్యుషితేఽపి చ, | వ్యుష్టం—(న) దినము, ప్రాతఃకాలము, ఫలము, తొలిరోజు చేసినపదార్థము. |
| త్వష్టా శిల్పిని దేవానాం తథావర్ధకి సూర్యయోః. | త్వష్టా—(ఋ-పు) దేవశిల్పి, వడ్రంగి, సూర్యుఁడు. |
| విష్టి కర్మకరే భద్రే పేషణే వేతనేఽపి చ, | విష్టిః—(త్రి) పనిచేయువాఁడు—(స్త్రీ) భద్రవాకరణము, పంపుట, కూలి. |
| ఇష్టిస్స్యా దభిలాషేఽపి సంగ్రహశ్లోకయాగయోః. | ఇష్టిః—(స్త్రీ) ఇచ్ఛ, సంక్షేపముగాఁ జేయఁబడినశ్లోకము, యజ్ఞము. |
| దిష్టిః పరిమాణముదోః | దిష్టిః—(స్త్రీ) కొలఁత, సంతోషము. |
| దృష్టిర్ధీ దర్శనాదిషు, | దృష్టిః—(స్త్రీ) బుద్ధి, చూపు నేత్రము. |
| రిష్టిః ఖడ్గే సమృద్ధౌ చ | రిష్టిః—(పు) కత్తి, సంపద. |
| కృష్టిస్స్యా త్కర్షణే బుధే. | కృష్టిః—(స్త్రీ)దున్నుట—(పు)పండితుఁడు. |
| సృష్టి స్స్వభావే నిర్మాణే | సృష్టిః—(స్త్రీ) స్వభావము, నిర్మాణము చేయుట. |
| పుష్టిర్వృద్ధౌ చ పోషణే, | పుష్టిః—(స్త్రీ) వృద్ధినొందుట, పోషించుట. |
| యష్టిర్హారలతా శస్త్రభేదయోర్ధ్వజదండకే. ౨౩. భార్గ్యాంచ మధుయష్ట్యాం | యష్టి—(స్త్రీ) హారపుసరము, ఆయుధవిశేషము, (లాటికఱ్ఱ) జెండాకఱ్ఱ, గంటుభారంకి, యష్టిమధుకము. |
| చ ముష్టిర్బద్ధకరేపలే, | ముష్టిః—(స్త్రీ) పిడికిలి, నాలుగంగుళములపరిమాణము. |
| వ్యుష్టిరుక్తా సమృద్ధౌస్యా న్నియమాది ఫలేఽపిచ. | వ్యుష్టిః—(స్త్రీ) సమృద్ధి, తపస్సువ్రతములు మున్నగువాని ఫలము. |
| భృష్టిస్స్యా ద్భర్జనే శూన్యవాటికాయాంచ కథ్యతే, | భృష్టిః—(స్త్రీ) వేయించుట, శూన్యప్రదేశము. |

| | |
|---|---|
| గృష్టిస్సకృత్ప్రసూతాగో వ<br>రాహక్రాంతయో రపి. | గృష్టిః—(స్త్రీ) తొలిచూలు ఈనినగోవు, వృక్షవిశేషము. |
| ఘృష్టిస్స్యాద్ఘర్షణే విష్ణు<br>క్రాంతాస్ఫూర్జాకి రిష్వపి, | ఘృష్టిః—(స్త్రీ) ఒరయుట, విష్ణుక్రాంతవృక్షము, వైరము, వరాహము. |
| జటాలగ్నకచేమూలే ప్లక్ష<br>మాంసికయో ర్జటీ. ౨౬. | జటా—(స్త్రీ) జడకట్టినవెండ్రుకలు, వేరు.<br>జటీ—(స్త్రీ) జువ్విచెట్టు, జటామాంసి. |
| సటాజటాకేసరయోః | సటా—(స్త్రీ)జడ, సింహముమీఁదివెండ్రుకలు. |
| స్ఫటాతు ఫణదంభయోః, | స్ఫటా—(స్త్రీ) పడగ, డాంబికము. |
| ఘోంటాస్యాద్బదరేపూగే | ఘోంటా—(స్త్రీ) రేఁగుచెట్టు, పోకచెట్టు. |
| ధటీఖండే చ వాససః. ౨౭. | ధటీ—(స్త్రీ) వస్త్రఖండము. |
| పరీక్షార్థతులాయాం చ<br>ధటస్స్యాద్రిభి రిష్యతే, | ధటః—(పు) త్రాసు |
| పటిః పటవిశేషేస్యాద్వ్యాగు<br>జౌకుంభికాద్రుమే ౨౮. | పటిః—(స్త్రీ) దుప్పటి, క్రాలుగచ్చచెట్టు, టేకుచెట్టు. |
| స్యాత్కోటి రశ్రౌ చాపా<br>గ్రే సంఖ్యాభేదప్రకర్ష<br>యోః, | కోటిః—(స్త్రీ) ఆయుధధార, వింటికొన, కోటిసంఖ్య, ఉత్కర్ష. |
| స్యాత్త్రుటిస్సంశయే లేశేసూ<br>క్ష్మైలాకాలమానయోః. | త్రుటిః—(స్త్రీ) సందేహము, స్వల్పపరిమాణము, సన్నయేలకులు, త్రుటికాలము. |
| త్రోటిస్స్యాత్కట్ఫలే చం<br>చ్వాం ఖగమీనవిశేష<br>యోః, | త్రోటిః—(స్త్రీ) టేకుచెట్టు, పక్షిముట్టె, పక్షివిశేషము, మత్స్యవిశేషము. |
| ఖాటిః కిణే శర్వరథే ఖాట<br>రేకగ్రహేఽపిచ. ౩౦. | ఖాటిః—(స్త్రీ) గాయముపడి కాయగాచినది, శవములకుఁ గట్టురథము, బాలురకు సోకుగ్రహము. |
| నటీ మాట్టవిలాసిన్యాం శో<br>ణకే నర్తకే నటః. | నటీ—(స్త్రీ) నఖమను గంధద్రవ్యము.<br>నఖః—(పు) దుండిగపుఁజెట్టు నాట్యకాఁడు. |

| | |
|---|---|
| అథ టాంత త్రివర్ణః. | టాంత త్రివర్ణము. |
| అవటస్స్యా త్క్షితే గర్తే కూ వే కుహకజీవిని. ౩౧. | అవటః—(పు) దున్నినభూమి, గోయి, నూయి, మోసముచేసి బ్రదుకువాఁడు. |
| వికట స్సుందరే ప్రోక్తో విశా లవికరాళయోః, | వికటః—(త్రి) సుందరమైనది, విస్తారమైనది, మిగుల భయంకరమైనది. |
| కరటో గజగండేస్యా త్కు సుంభే నింద్యజీవిని. ౩౨. ఏకాదశాహశ్రాద్ధే చ దుర్ధురూటే చ వాయసే, కరటో వాద్యభేదేఽపి | కరటః—(పు) ఏనుఁగు గండస్థలము, కుసుంభవృక్షము, నింద్యజీవనము గలవాఁడు, పదునొకండవనాఁటిశ్రాద్ధము, నాస్తికుఁడు, కాకి, వాద్యవిశేషము. |
| నిర్ధటో నిర్దయే స్మృతః. ౩౩. పరాపవాదసంరక్తే నిర్ధటే ష్ప్రయోజనే, | నిర్ధటః—(త్రి) దయలేనివాఁడు, పరులయపవాదము విన నాసక్తిగలవాఁడు, ప్రయోజనములేనిది. |
| చిపిటః ఖాద్యభేదేఽపి చిపిటో విస్తృతేఽన్యవత్. | చిపిటః—(పు) అటుకులు (త్రి) విస్తరింపఁజేయఁబడినది. |
| జకుటో యమశైఖ్యాతో వార్తాక కుసుమే శుని, | జకుటః—(పు) కవలపిల్లలు, వంగపూవు, కుక్క. |
| నిష్కుటస్తు గృహోద్యానే కేదారకకవాటయోః. | నిష్కుటః—(పు) గృహసమీపమునఁగల పూఁదోట, పంటభూమి, తలుపు. |
| హార్మటః కచ్ఛపేసూర్యే | హార్మటః—(పు) తాఁబేలు, సూర్యుఁడు. |
| ప్యుత్కట స్తీవ్రమత్తయోః, | ఉత్కటః—(త్రి) వాఁడియైనది, మదించినది. |
| చర్పట స్స్ఫారవిపుల చపేటే పర్పటేఽపిచ. ౩౪. | చర్పటః—(త్రి) చాచినవ్రేళ్లు గలహస్తము, అప్పడము. |
| పర్పటః పిష్టవికృతౌ పర్పటో భేషజాంతరే, | పర్పటః—(పు) అప్పడము, పర్పాటకమను నొక యోషధివిశేషము. |
| పిచ్ఛటో నేత్రరోగేస్యా త్పిచ్ఛటం త్రపుసీసయోః. | పిచ్ఛటః—(పు) నేత్రరోగవిశేషము, పిచ్ఛటం—(న) తరగము, సీసము. |
| త్ర్యంకటం శిక్యభేదేఽపి దాతాంజనాఖ్యమపి స్మృతం. | త్ర్యంకటం—(న) ఉట్టి, వృక్షవిశేషము. |

వసంతదూతీ పాటల్యాం గణి కార్యతిముక్తయోః. వసంతదూతీ—(స్త్రీ) పాటలీలత, పుష్ప వృక్షవిశేషము, బండిగురుగువెంద చెట్టు.

అథ తాంత షడ్వర్ణః.

తాంత షష్ఠవర్ణము.

అర్ధపారావతశ్చిత్రకంఠే తి త్తిరిపక్షిణి, అర్ధపారావతః—(పు) పావురములలో భేదము, తీతువుపిట్ట.

అథ తాంత సప్తవర్ణః.

తాంత సప్తమవర్ణము.

సముద్రనవనీతాఖ్యా పీయూషామృతరోచిషోః. ౨౩౧ సముద్రనవనీతః—(పు) అమృతము, చంద్రుడు.

అథ థాంతవర్ణః.

థాంతవర్ణము.

రథస్స్యాత్స్యందనే కాయే చరణే వేతసేఽపి చ, రథః—(పు) రథము, శరీరము, పాదము ప్రబ్బలిచెట్టు. [దర్భ.

కుథః ప్రవేణీకుథయోః కుథః—(స్త్రీ) ఏనుగుపై వేయు చిత్రము వస్త్రము,

సీథోఽర్కే పీథమంభసి. ౧. పీథః—(పు) సూర్యుడు, (న) జలము.

కోథస్తు శఠితే నేత్రరుగ్భేధే మంథనేఽపి చ, కోథః—(పు) దుష్టత్వము, నేత్రరోగ విశేషము, మథించుట.

ప్రోథోఽధ్వగేఽశ్వఘోణాయాంకటీస్త్రీగర్భయోరపి. ప్రోథః—(పు) బాటసారి, గుఱ్ఱపుముట్టె, కటిప్రదేశము, స్త్రీలగర్భము.

క్వాథస్స్యాద్ద్రవనిష్పాకే దుఃఖవ్యసనయోరపి, క్వాథః—(పు) ద్రవపదార్థము కాచుట దుఃఖము, ఆపద.

సిక్థం నీల్యాం మధూచ్ఛిష్టే సిక్థ ఓదనసంభవే. ౩. సిక్థం—(న) నీలిమందు, మైనము; (పు) అన్నకణము.

పృథుర్నృపే కృష్ణజీరే వా పాఠ్యం పృథుమహత్యపి, పృథుః—(పు) పృథుచక్రవర్తి, నల్లజీలకఱ్ఱ, డిగుడుబావి, (త్రి) విస్తారమైనది.

దుఃస్థస్స్యాద్దుర్గతే మూర్ఖే దుఃస్థః—(పు) దరిద్రుడు, మూర్ఖుడు.

ప్రస్థశ్శిఖరమానయోః. ౪. ప్రస్థనో ప్రయాణే తు ప్రస్థాపి పరికథ్యతే, ప్రస్థః—(పు) పర్వతశిఖరము, కుంచెడు పరిమాణము, (న) కొండచరియ. (స్త్రీ) ప్రయాణము.

తుత్థోగ్నావంజనే తుత్థా తుత్థః—(పు) అగ్ని, తుత్థము, (న) మైల

| | |
|---|---|
| నీలీసూక్ష్మైలయోరపి. | (స్త్రీ) నీలిచెట్టు, సన్నయేలకులు. |
| మంథస్స్యాత్సక్తవమంథాననేత్రామయదివాకరే, | మంథః—(పు) సక్తుపిండితోఁజేయుపానీయము, కవ్వము, నేత్రరోగవిశేషము, సూర్యుఁడు. |
| గ్రంథో ధనే స్యాత్సందర్భే ద్వాత్రింశద్వర్ణనిర్మితే. | గ్రంథః—(పు) ధనము, ప్రబంధరచనము, అనుష్టుప్ఛ్లోకము. |
| గ్రంథిః పర్వణి కౌటిల్యే గ్రంథిపర్ణే గదాంతరే, | గ్రంథిః—(పు) చెఱకుమున్నగు వానికణుపు, కుటిలత్వము, స్థానేయమను గంధద్రవ్యము, కణితి. |
| అర్థః ప్రకారే విషయే విత్తకారణవస్తుషు. అభిధేయే చ శబ్దానాం నివృత్తౌ చ ప్రయోజనే, | అర్థః—(పు) విధము, విషయము, ధనము, కారణము, మృత్పాషాణాది వస్తువు. శబ్దముయొక్క వాచ్యార్థము, మరలుట, ప్రయోజనము. |
| తీర్థం శాస్త్రాధ్వరక్షేత్రోపాయోపాధ్యాయ మంత్రిషు. అవతారర్షిజుష్టాంభః స్త్రీరజస్సు చ విశ్రుతం, | తీర్థం—(న) శాస్త్రము, యజ్ఞము, పుణ్యక్షేత్రము, ఉపాయము, గురువు, మంత్రి, నీళ్లరేవు, ఋషులుస్నానము చేయుసరస్సు, రజోరక్తము. |
| సార్థో వణిక్సమూహే స్యాదపిసంఘాతమాత్రకే. | సార్థః—(పు) వర్తకసమూహము, సంఘము. |
| పార్థస్తు కకుభే జిష్ణౌ | పార్థః(పు) వీణకరివె, అర్జునుఁడు. |
| గాథా వాగ్భేదవృత్తయోః, | గాథా—(స్త్రీ) ప్రాకృతాదిభాషలు, శ్లోకము. |
| కంథా మృణ్మయభిత్తౌ చ కంథా ప్రావరణాంతరే. | కంథా—(స్త్రీ) మట్టిగోడ, కంచ. |
| ఆస్థాచాలంబనాస్థానయత్నాపేక్షాసు కథ్యతే, | ఆస్థా—(స్త్రీ) ఆధారము, కొలువుకూటము, ప్రయత్నము, కోరిక. |
| సంస్థా స్థిరా చరే నాశే వ్యక్తిసాదృశ్యయోరపి. | సంస్థా—(స్త్రీ) ఉండుట, (పు) దూత, (స్త్రీ) నాశనము, ఆకారము, సామ్యము. |
| వీథీ గృహాంగే పంక్తౌ చ నాట్యరూపకవర్త్మనోః, | వీథీ—(స్త్రీ) గృహములవరుస, వరుస, నాటకభేదము, మార్గము. |

యూథీ పుష్పప్రభేదే స్యాన్మాగధ్యాం చ కురంటకే.
యూథీ—(స్త్రీ) పుష్పవిశేషము, అడివిమొల్లచెట్టు, పచ్చపూవులగోరింట.

యూథం తిర్యక్సమూహే స్యాద్బృందమాత్రే చ భాషితం,
యూథం—(న) పశ్వాదుల సమూహము, సంఘము.

---

అథ థాంతస్త్రీవర్గః. — థాంత త్రివర్గము.

మన్మథః కామచింతాయాం కపిత్థే కుసుమాయుధే.
మన్మథః—(పు) కామోద్రేకము, వెలఁగచెట్టు, మన్మథుఁడు.

ఉన్మాథః కూటయంత్రే స్యాన్మారణే ఘాతుకేఽపి చ,
ఉన్మాథః—(పు) పులిమున్నగువానిఁబట్టుబోను, చంపుట, ఘాతుకుఁడు.

ప్రమథోఽపి గణే ప్రోక్తః పథ్యాయాం ప్రమథా మతా. ౧౪
ప్రమథః—(పు) ప్రమథగణము, (స్త్రీ) కరకచెట్టు.

నిశీథోఽప్యర్ధరాత్రే స్యాన్నిశీథో రాత్రిమాత్రకే,
నిశీథః—(పు) అర్ధరాత్రి, రాత్రి.

విదథో యోగికృతినో
విదథః—(పు) యోగి, పుణ్యాత్ముఁడు.

రుద్రథశ్శుని కుక్కుటే ౧౫.
ఉద్రథః—(పు) కుక్క, కోడి.

సనాథస్సదృశే యుక్తే నాథవత్యపి దృశ్యతే,
సనాథః—(త్రి) సమానమైనది, కూడుకొన్నది, నాథుఁడుగలది.

శమథస్సచివే శాంతౌ
శమథః—(పు) మంత్రి, ఓరిమి.

దమథో దమదండయోః. ౧౬.
దమథః—(పు) ఇంద్రియనిగ్రహము, దండనము.

వరూథో రథగుప్తౌ స్యాద్వరూథం చర్మవేశ్మనోః,
వరూథః—(పు) రథమునకుఁ గప్పినవ్యాఘ్రాదిచర్మము, సామాన్య చర్మము, గృహము.

అతిథిః కుశపుత్రేఽపి కోపే ప్రాఘూర్ణికేఽపి చ. ౧౭.
అతిథిః—(పు) కుశుని కుమారుఁడు, కోపము, ఆగంతుకుఁడు.

వమథుర్వమనేఽపి స్యాద్గజస్యకరశీకరే,
వమథుః—(పు) వాంతి, ఏనుఁగుతుండము కొననుండివచ్చు తుంపురులు.

| | |
|---|---|
| క్షవథుస్స్యాత్క్షుతే కాసే హిక్కాయామపి కథ్యతే. | క్షవథుః—(పు) తుమ్ము, దగ్గు, ఎక్కిళ్లు. |
| సమర్థోఽపి హితే శక్తే సంబంధార్థేఽపి సమ్మతః, | సమర్థః—(పు) ఇష్టుఁడు, సామర్థ్యము గలవాఁడు, సంబంధార్థము. |
| సిద్ధార్థశ్శాక్యసింహే స్యాత్సిద్ధార్థస్సితసర్షపే. ౧౯. | సిద్ధార్థః—(పు) బుద్ధుఁడు, తెల్లావాలు. |
| కాయస్థోఽపి నృజాతే స్యాత్పృథ్విభేదే పరమాత్మని, కాయస్థా తు హరీతక్యామామలక్యాం చ దర్శితా. ౨౦ | కాయస్థః—(పు) బ్రాహ్మణస్త్రీయందు క్షత్త్రియునకు జనించినవాఁడు, పరమాత్మ, (స్త్రీ) కరక్కాయ, ఉసిరికకాయ. |
| వయస్థో వాచ్యవదన్యాని వయస్థా శాల్మలీ ద్రుమే, బ్రాహ్మీగుడూచీ కాకోలీ సూక్ష్మైలామలకీషు చ. | వయస్థః—(త్రి) పిన్నవయస్సుగలది, (స్త్రీ) బూరుగుచెట్టు, పొన్నగంటికూర, తిప్పతీఁగ, కాకోలియనునోషధి, సన్నయేలకులు, ఉసిరికకాయ. |
| అశ్వత్థో గర్దభాండే స్యాత్పిప్పలే పూర్ణిమాతిథౌ, | అశ్వత్థః—(పు) కలజువ్విచెట్టు, రావిచెట్టు, పూర్ణిమాతిథి. |
| ఉపస్థో మేఢ్ర ఉత్సంగే భగే పాయౌ చ కథ్యతే. ౨౨. | ఉపస్థః—(పు) శిశ్నము, ఉపరిభాగము, యోని, గుదస్థానము. |
| నిర్గ్రంథో నగ్నకేఽపి స్యాన్నిస్స్వబాలిశయోరపి, | నిర్గ్రంథః—(పు) దిగంబరుఁడు, దరిద్రుఁడు, వివేకములేనివాఁడు. |
| గోగ్రంథిస్తు కరీషే స్యాద్గోష్ఠే గోజిహ్వౌషధే. ౨౩. | గోగ్రంథిః—(పు) ఎరువు, ఆవులమంద, ఎద్దునాలుకచెట్టు. |
| అవ్యథా తు హరీతక్యాం పన్నగే నిర్వ్యథేఽపి చ, | అవ్యథా—(స్త్రీ) కరకచెట్టు, పాము, బాధలేమి. |
| షడ్గ్రంథాపి వచాసింహాస్యే షండగ్రంథోఽపి ప్రకీర్త్యతే ౨౪. | షడ్గ్రంథః—(పు) వస, ఆరుకణపులకానుగుచెట్టు. |

### అథ థాంత శ్చతుర్వర్ణః.

### థాంత చతుర్వర్ణము.

చిత్రరథస్స్యాద్గంధర్వే రవౌ విద్యాధరాంతరే,

చిత్రరథః—(పు) చిత్రరథుఁడను గంధర్వుఁడు, సూర్యుఁడు, విద్యాధరుఁడు.

చతుష్పథశ్చతుర్మార్గ సంగమేఽపి ద్విజేఽపి చ. ౨౫.

చతుష్పథః—(పు) నాలుగుత్రోవలుకలియుచోటు, బ్రాహ్మణుఁడు.

వానప్రస్థో మధూకే స్యాత్కింశుకే చాశ్రమాంతరే,

వానప్రస్థః—(పు) ఇప్పచెట్టు, మోదుగుచెట్టు, వానప్రస్థాశ్రమము.

దశమీస్థో నష్టబీజే స్థవిరే చ ప్రచక్షతే. ౨౬.

దశమీస్థః—(పు) వీర్యపటుత్వములేనివాఁడు, ముదుసలివాఁడు.

అనీకస్థో రణఖలే గజశిక్షావిచక్షణే, రాజరక్షే చ చిహ్నే చ వీరమర్దళకేఽపి చ. ౨౭.

అనీకస్థః—(పు) యుద్ధభటుఁడు, ఏనుఁగులకాట నేర్పువాఁడు, రాజుయొక్క అంగరక్షకుఁడు, చిహ్నము, యుద్ధమునవాయించు వాద్యము.

భవేదితికథా నష్టధర్మేఽపార్థే వచస్యపి, అశ్రద్ధేయేఽ

ఇతికథా—(స్త్రీ) అధర్మమైనది, అపార్థమునిచ్చువాక్యము, నమ్మఁదగనిమాట.

స్యాదుదరథి స్సముద్రే చ వియన్మణౌ. ౨౮.

ఉదరథిః—(పు) సముద్రుఁడు, సూర్యుఁడు.

---

### అథ దాంతో ద్వివర్ణః.

### దాంత ద్వివర్ణము.

గదో భ్రాతరి విష్ణోస్స్యాద్దామయేఽప్యాయుధే గదా,

గదః—(పు) గదుఁడను కృష్ణునియన్న, రోగము, (స్త్రీ) గదాయుధము.

నదస్సముద్రే నినదే నదీ తు సరితి స్మృతా. ౧

నదః—(పు) సముద్రము, ధ్వని, (స్త్రీ) నది.

మదో రేతసి కస్తూర్యాం గర్వే హర్షే భదానయోః, మద్యేఽపి మద ఆఖ్యాతో మదీ చషకవస్తుని.

మదః—(పు) రేతస్సు, కస్తూరి, గర్వము, సంతోషము, గజమదము, కల్లు, (స్త్రీ) సురాపాత్రము.

పదం శబ్దే చ వాక్యే చ వ్యవసాయాపదేశయోః, పా

పదం—(న) శబ్దము, వాక్యము, ప్రయత్నము, మిష, పాదము, పాదచిహ్న

| | |
|---|---|
| దప చ్చిహ్నయోః స్థాన త్రాణయోరంకవస్తునోః. | ము, ప్రదేశము, రక్షణము, చిహ్నము, వస్తు. |
| ఛదః పలాశే గరుతి గ్రంథిపర్ణతమాలయోః, | ఛదః—(పు) ఆకు, ఱెక్క, స్థౌణేయమను గంధద్రవ్యము, తాపింఛ వృక్షము. |
| రదో విలేఖనే దంతే | రదః—(పు) వ్రాయుట, దంతము. |
| భద్రం కల్యాణశర్మణోః. న. | భద్రం—(న) మంగళము, సుఖము. |
| భేదో ద్వైధే విశేషే స్యా దుపజాతే విదారణే, | భేదః—(పు) వేరగుట, విశేషము, భేదోపాయము, ఖండించుట. |
| స్వేదస్తు స్వేదనే ఘర్మే | స్వేదః—(పు) మందులువండుబట్టీ,ఉక్క. |
| శాదః కర్దమశష్పయోః. పు. | శాదః—(పు) బురద, లేతగడ్డి. |
| పాదో బుధ్నే తురీయాంశే శైలప్రత్యంతపర్వతే, చరణే చ మయూఖే చ | పాదః—(పు) చెట్టువేరు, నాలవభాగము, పర్వత ప్రాంతమునందలి చిన్నమెట్ట, పాదము, కిరణము. |
| క్షోదో రజసి పేషణే. పు. | క్షోదః—(పు) పిండి, నూరుట |
| సూదస్తు సూపవత్స్యాకారే చ వ్యంజనాంతరే, | సూదః—(పు) (సూప శబ్దమునకువలె) వంటలవాఁడు, ముద్దపప్పు. |
| స్వాదుర్మనోజ్ఞే మృష్టే చ | స్వాదుః—(త్రి) మనోహరమైనది, రుచిగలది. |
| మృదుస్స్యాత్కోమలేఽఖరే | మృదుః—(త్రి) లేతగానుండునది, మెత్తనిది. |
| అబ్దస్సంవత్సరే మేఘే గిరిభేదే చ ముస్తకే, | అబ్దః—(పు) సంవత్సరము, మేఘము, పర్వతవిశేషము, తుంగముస్తె. |
| బిందుర్దంతక్షతేఽపి స్యాత్తథా వేదితృవిప్రుషోః. పు. | బిందుః—(పు) దంతక్షతవిశేషము, లౌకికవైదికజ్ఞానముగలవాఁడు. జలబిందువు. |
| కుందశ్చక్రభ్రమౌ మాఘ్యే నిధిభేదే మురద్విషి, | కుందః—(పు) కత్తులకుఁ బట్టుసాన, మొల్లచెట్టు, కుబేరునినిధివిశేషము, విష్ణువు. |
| కందస్స్యాత్స్ఫురణే సస్యమూలే జలధరేఽపి చ. | కందః—(పు) కందదుంప, పైరుదుబ్బు, మబ్బు. |

| | |
|---|---|
| మందః ఖలే మదరతే మూర్ఖే స్వైరేఽల్పరోగిణోః, అభాగ్యేఽపి చ పాతంగగజజాతిప్రభేదయోః. ౧౦ | మందః—(త్రి) దుర్మార్గుఁడు, బద్ధకుఁడు, మూర్ఖుఁడు, స్వేచ్ఛగలవాఁడు, నీచుఁడు, రోగి, నిర్భాగ్యుఁడు, (పు) శనిగ్రహము, మందజాతియేనుఁగు. |
| ఛందో వశేఽప్యభిప్రాయే | ఛందః—(పు) అధీనము, అభిప్రాయము. |
| హృదాఖ్యా చిత్తబుక్కయోః, | హృత్—(పు) చిత్తము, గుండెలోని మాంసము. |
| వేదిరంగుళిముద్రాయాం బుధేఽలంకృతభూతలే ౧౧ | వేదిః—(స్త్రీ) సుముఖాంకముద్రలు, (పు) విద్వాంసుఁడు, యజ్ఞమందు శుబంధనము కొఱకు బాగుచేసిననేల. |
| అందుస్స్యాద్బంధనద్రవ్యే ప్రభేదే భూషణస్య చ, | అందుః—(పు) గొలుసు, స్త్రీలుపాదమున ధరించు అందె. |
| నందిరానందనే ద్యూతే ప్రతీహారే హరస్య చ. ౧౨ | నందిః—(స్త్రీ) ఆనందము జూదము, (పు) నందికేశ్వరుఁడు. |
| విదా జ్ఞానే చ బుద్ధౌచ | విదా—(స్త్రీ) జ్ఞానము, బుద్ధి. |
| ధీదా కన్యామనీషయోః, | ధీదా—(స్త్రీ) పడుచు, బుద్ధి. |
| నిందాపవాదే కుత్సాయాం | నిందా—(స్త్రీ) అపవాదము, దూషణము. |
| నందా మణికసంపదోః. ౧౩ | నందా—(స్త్రీ) బాన, సంపద. |

---

| | |
|---|---|
| అథ దాంత స్త్రీవర్గః. | దాంత త్రివర్గము. |
| దనదో దాతరి శ్రీదే | ధనదః—(పు) దాత, కుబేరుఁడు. |
| జలదో ముస్తకేఽంబుదే | జలదః—(పు) తుంగముస్తె, మేఘము. |
| నలదం స్యాత్పుష్పరసే మాంసికోశీరయోరపి. ౧౪. | నలదం—(న) మకరందము, జటామాంసి, వట్టివేరు. |
| ప్రమదస్సమ్మదే మత్తే కామిన్యాం ప్రమదా మతా, | ప్రమదః—(పు) సంతోషము, (త్రి) మదించినది, (స్త్రీ) ఆఁడుది. |
| విశదః పాండురే వ్యక్తే | విశదః—(త్రి) తెల్లనిది, స్పష్టమైనది |
| జీవదో వైద్యవిద్విషోః. ౧౫. | జీవదః—(పు) వైద్యుఁడు, శత్రువు. |
| అంగదః కపిభేదే స్యాత్కేయూరేఽంగద మిష్యతే, | అంగదః—(పు) వాలికుమారుఁడు, (న) బాహుపురి, (స్త్రీ) వామన మనుదిగ్గ |

| | |
|---|---|
| అంగదా యామ్యదిగ్దంతి హస్తిన్యాం సముదాహృతా. ౧౭. | జము భార్య. |
| వరదోఽపి ప్రసన్నే స్యాద్వరదశ్శాంతచేతసి, వరదాపి చ కన్యాయా | వరదః—(పు) అనుగ్రహించినవాఁడు, ఓర్పుగలవాఁడు, (స్త్రీ) కన్యక. |
| మామోదో గంధహర్షయోః. | ఆమోదః—(పు) పరిమళము, సంతోషము. |
| నర్మదః కేళిసచివే నర్మదా సరిదంతరే, | నర్మదః—(పు) క్రీడాసచివుఁడు, (స్త్రీ) నర్మదానది. |
| క్షణదో గణకే రాత్రౌ క్షణదా క్షణదం జలే. ౧౮. | క్షణదః—(పు) జ్యోతిష్కుఁడు, (స్త్రీ) రాత్రి, (న) జలము. |
| కపర్దః ఖండపరశోర్జటాజూటే వరాటకే, | కపర్దః—(పు) శివునిజటాజూటము,గవ్వ. |
| ఆస్పదం తు పదే కృత్యే | ఆస్పదం—(న) స్థానము, కర్మము. |
| నిషాదశ్శ్వపచే స్వరే. ౧౯. | నిషాదః—(పు) కిరాతుఁడు, నిషాదస్వరము. |
| ప్రసాదోఽనుగ్రహే కావ్యగుణస్వాస్థ్యప్రసక్తిషు, | ప్రసాదః—(పు) దయ, ప్రసాదమను కావ్యగుణము,స్వస్థత,ప్రయోజనము. |
| ప్రాసాదః కథ్యతే దేవనరదేవనివాసయోః. ౨౦. | ప్రాసాదః—(పు) దేవాలయము, రాజాంతఃపురము. |
| శారదః పీతముద్గే స్యాచ్ఛాలీనేఽప్రతిభే నవే, వర్షేఽథ జలపిప్పల్యాం సప్తపర్ణే చ శారదీ. ౨౧. | శారదః—(పు) పచ్చపెసలు, (త్రి) పిఱికివాఁడు, తెలివిలేనివాఁడు, నూతనమైనది, (పు) సంవత్సరము, (స్త్రీ) నీటిపిప్పలి, ఏడాకులరటి. |
| దారదో విషభేదే స్యాద్ధింగుళే పారదేఽపి చ, | దారదః—(పు) దరదదేశమునందుఁబుట్టినవిషము, ఇంగువ, పాదరసము. |
| తోయదం తు ఘృతే ప్రోక్తం తోయదో ముస్తకాబ్దయోః. ౨౨. | తోయదం—(న) నెయ్యి, (పు) తుంగముస్తె, మేఘము. |

| | |
|---|---|
| నిర్వాదస్స్యాత్పరీవాదహరి నిశ్చితవాదయోః, | నిర్వాదః—(పు) అపవాదము, నిశ్చయమగునింద. |
| అర్బుదో మాంసకీలే స్యాద్దశకోటిషు చార్బుదం. ౨౩ శైలేఽర్బుదోఽ | అర్బుదః—(పు) మాంసపుకండ, (న) పదికోట్లు, (పు) పర్వతము. |
| థ సంభేదస్స్ఫుటనే సింధుసంగమే, | సంభేదః—(పు) భేదించుట, నదీసాగరసంగమము. |
| కుసీదం జీవనే వృద్ధ్యా కుశీదశ్చ కుసీదికే ౨౪. | కుసీదం—(న) వడ్డీవ్యాపారము, (త్రి) వడ్డిచేత జీవనముచేయువాఁడు |
| ప్రణాదస్త్వాగశబ్దే స్యాత్పుణాదశ్శ్రవణామయే, | ప్రణాదః—(పు) బిగ్గఱగా నఱచుట, కర్ణరోగవిశేషము |
| ప్రహ్లాదః ప్రమదే దైత్యే | ప్రహ్లాదః—(పు) సంతోషము, ప్రహ్లాదుఁడు. |
| దాయాదో జ్ఞాతిపుత్రయోః | దాయాదః—(పు) జ్ఞాతి, పుత్త్రుఁడు. |
| మేనాదః కేకిమార్జాలచ్ఛాగలేషు సమీరితః, | మేనాదః—(పు) నెమిలి, పిల్లి, మేఁక. |
| గోవిందో వాసుదేవే స్యాద్గవాధ్యక్షే బృహస్పతౌ. | గోవిందః—(పు) విష్ణువు, గోవులగాచువాఁడు, బృహస్పతి. |
| ఆక్రందో దారుణరణే మిత్రే త్రాతరి రోదనే, | ఆక్రందః—(పు) భయంకరమగు యుద్ధము, స్నేహితుఁడు, రక్షకుఁడు, ఏడ్చుట. |
| మాకందస్సహకారే స్యాన్మాకంద్యామలకీఫలే. ౨౫. | మాకందః—(పు) తియ్యమామిడి, (స్త్రీ) ఉసిరికకాయ. |
| అర్ధేందుశ్చంద్రశకలే గళహస్తనఖాంకయోః, అర్ధేందుస్స్యాదతిప్రౌఢస్త్రీగుహ్యాంగులియోజనే. ౨౬. | అర్ధేందుః—(పు) అర్ధచంద్రుఁడు, చాచఁబడిన తర్జన్యంగుష్ఠములుగల హస్తము, నఖచిహ్నము, సంభోగకాలమున ప్రౌఢస్త్రీలభగమున నంగుష్ఠమును జొనుపుట. |
| కర్ణేందురుత్క్షిప్తికాయాం కర్ణపాళ్యామపీరితా, | కర్ణేందుః—(పు) కర్ణభూషణము, కర్ణప్రదేశము. |

స్యాత్కౌముదః కార్తికే కౌముదః—(పు) కార్తికమాసము, (స్త్రీ) చంద్రికాయాం చ కౌ వెన్నెల.
ముదీ. ౨౯

కుముదం కైరవే రక్తపంక కుముదం—(న) తెల్లకలువ, ఎఱ్ఱదామ జేకుముదః కపౌ, దై ర, (పు) కుముదుఁడను వానరుఁడు, త్యాంతరే చ దిఙ్నాగ కుముదాసురుఁడు, దిగ్గజము, సర్ప నాగయోరపికీర్తితః. ౩౦. విశేషము, (స్త్రీ) ఓకుచెట్టు, గుమ్మడి కుముదా కుంభగంభా చెట్టు.
రో

స్యాత్కుముత్కృపణే కుముత్—(త్రి) లోభి, సంతోషము ఽన్యవత్, కుముదేఽపి లేనివాఁడు.
కుముత్ప్రోక్తం

క్రవ్యాన్మాంసాశిరక్షసోః ౩౧ క్రవ్యాత్—(త్రి) మాంసభోజీ, రాక్షసుఁడు.

కకుద్వత్కకుదం శ్రేష్ఠే వృ కకుత్ } —(న) శ్రేష్ఠము,ఎద్దుమూపురము, ఛత్రచామరాదిరాజ
షాంకే ంజలక్ష్మణి, కకుదం } చిహ్నము.

ముకుందః పుండరీకాక్షే ర ముకుందః—(పు) విష్ణువు, రత్నవిశేషము, పాదరసము,
త్నభేదే చ పారదే. ౩౨ [భయము.
దరత్ప్రపాతాద్రిభయే దరత్—(స్త్రీ) కొండచరియ, పర్వతము,
శరత్సంవత్సరే ఋతౌ శరత్—(స్త్రీ) సంవత్సరము, శరదృతువు.
దృషత్పేషణశిలాయాం స్యాద్దృష దృషత్—(స్త్రీ) సన్నెకల్లు, శిల.
త్పాషాణమాత్రకే. ౩౩.
సంపద్భూతౌ గుణోత్కర్షే సంపత్—(స్త్రీ) సంపద, గుణాతిశయము,
హారభేదే చ దృశ్యతే, పుష్పమాలికావిశేషము. [ము.
భసత్ప్రభాస్వరే మాంసే భసత్—(త్రి) ప్రకాశించునది, మాంస
తరత్కారండవే ప్లవే. ౩౪. తరత్—(పు) కన్నెలేడిపిట్ట, తెప్పకొయ్య.

సంవిత్ జ్ఞానే ప్రతిజ్ఞాయాం సంవిత్—(స్త్రీ) జ్ఞానము, ప్రతిజ్ఞ, సంకేతము, ఆచారము, నామధేయము,
సంకేతాచారనామసు,

| | |
|---|---|
| సంభాషణే తోషణే ఽపి క్రియాకారే చ సంగరే. | సంభాషణము, సంతోషము, క్రియా నిశ్చయము, యుద్ధము. |
| కామదా ధేనుకాయాం స్యా ద్వాచ్యవత్కామదోగ్ధరి, | కామదా—(స్త్రీ) కామధేనువు, (త్రి) కోరికలనిచ్చువాఁడు. |
| సునందా రోచనానార్యోః | సునందా—(స్త్రీ) గోరోచనము, స్త్రీ. |
| మర్యాదా సీమని స్థితౌ. ౩౬. | మర్యాదా—(స్త్రీ) హద్దు, ఆచారము తప్పకుండుట. |

---

| | |
|---|---|
| అథ దాంత శ్చతుర్వర్ణః. | దాంత చతుర్వర్ణము. |
| ఏకపదం స్యాత్తత్కాలే పద వ్యా మేకపద్యపి, | ఏకపదం—(న) అప్పుడు, (స్త్రీ) మార్గము. |
| చతుష్పదస్సా న్యత్కరణే గ వాశ్వాదిపశుష్వపి. ౩౭. | చతుష్పదః— (పు) కరణవిశేషము, పశువు. |
| భవేద్విష్ణుపదాభిఖ్యా క్షీరా బ్ధౌ గగనేఽంబుజే, ప్రోక్తా విష్ణుపదీ గంగాసంక్రాంతి ద్వారకాసు చ. ౩౮. | విష్ణుపదం—(న) పాలసముద్రము, ఆకాశము, పద్మము, (స్త్రీ) గంగ, సంక్రమణవిశేషము, ద్వారకాపట్టణము. |
| భవేజ్జనపదో దేశే | జనపదః—(పు) దేశము. |
| జనే జానపదోఽపి చ, | జానపదః—(పు) మనుష్యుఁడు. |
| ప్రియంవదః ఖేచరే స్యాత్ప్రి యవాచి చ వాచ్యవత్. | ప్రియంవదః—(పు) ఒకగంధర్వుఁడు, (త్రి) ప్రియవాక్యములు చెప్పువాఁడు. |
| అపవాదస్తు నిందాయా మా జ్ఞావిస్రంభయోరపి, | అపవాదః—(పు) నింద, ఆజ్ఞ, విశ్వాసము. |
| పరివాదః కలంకే స్యాద్వీణా వాదనవస్తుని. ౪౦. | పరివాదః—(పు) నింద, వీణవాయించు కోడుపు. |
| సమర్యాదస్సమీపే స్యాన్మ ర్యాదాసహితేఽపి చ, | సమర్యాదః—(పు) సమీపము, (త్రి) మర్యాదతోఁగూడినది. |
| పుటభేదో నదీవక్త్రే పత్తనా తోద్యయోరపి. ౪౧. | పుటభేదః— (పు) నదులకు నీరువచ్చు మార్గము, పట్టణము, వాద్యవిశేషము. |
| అష్టాపదం స్యాత్కనకే శారీ | అష్టాపదం—(న) బంగారము, పాచిక |

ణాం ఫలేఽపి చ, అష్టాపదశ్చ శరభే చంద్రమల్యాం చ మర్కటే. ౭౪. — లాడుబల్లి, (పు) శరభమృగము, వృక్షవిశేషము, కోఁతి.

మేఘనాదస్తు వరుణే స్తనితే రావణాత్మజే, — మేఘనాదః—(పు) వరుణదేవుఁడు, మేఘధ్వని, ఇంద్రజిత్తు.

మహానాదః కుంజరే స్యాద్వర్షుకాబ్దే శయానకే ౭౫. — మహానాదః—(పు) ఏనుఁగు, వర్షించు మేఘము, సర్పము,

భవేత్కోకనదం రక్తకైరవే రక్తపంకజే, — కోకనదం—(న) ఎఱ్ఱకలువ, ఎఱ్ఱతామర

విశారదో బుధే ధృష్టేఽ — విశారదః—(పు) విద్వాంసుఁడు, నేర్పరి.

భిమర్దో రణమంథయోః ౭౬. — అభిమర్దః—(పు) యుద్ధము, కవ్వము.

పీఠమర్దోఽతిధృష్టే స్యాన్నాట్యోక్తౌ నాయకప్రియే, — పీఠమర్దః—(పు) మిగుల దిట్టతనముగలవాఁడు, శృంగారనాయక సచివులలో నొకఁడు

ముచుకుందో ద్రుభేదే స్యాన్మునిదైత్యవిశేషయోః. — ముచుకుందః—(పు) పుష్పవృక్షవిశేషము, ముచుకుందమహాముని, దైత్యులలో నొకఁడు,

కురువిందస్తు ముస్తాయాం కుల్మాషవ్రీహిభేదయోః, హింగుళే పద్మరాగే స్యాన్ముకురే చ సమీరితః. — కురువిందః—(పు) కోలతుంగముస్తె, అలచందలు, ధాన్యవిశేషము, ఇంగువ, పద్మరాగమణి, అద్దము.

అభిష్యందోఽతివృద్ధౌ స్యాద్దాస్రావేఽక్షిగదేఽపి చ, — అభిష్యందః—(పు) మిగుల వృద్ధినొందుట, కారుట, నేత్రరోగము.

కటుకందం విదుశ్శిగ్రౌ శృంగిబేరరసోనయోః. ౭౭. — కటుకందం—(న) మునగచెట్టు, అల్లము, వెల్లుల్లి.

తమోనుదగ్నీంద్వర్కేషు — తమోనుత్—(పు) అగ్ని, చంద్రుఁడు, సూర్యుఁడు.

ప్రతిపత్తిథిసంవిదోః, — ప్రతిపత్—(స్త్రీ) పాడ్యమి, జ్ఞానము.

శతహ్రదా భవేద్వజ్రే సౌదామిన్యాం చ కీర్తితా. ౭౮ — శతహ్రదా—(స్త్రీ) వజ్రాయుధము, మెఱుపు.

| | |
|---|---|
| చక్రపాచ్చక్రపాదశ్చ స్యం చక్రపాత్ దనే కుంజరేఽపి చ, చక్రపాదః | —(పు) రథము, ఏనుగు. |

| అథ దాంత పంచవర్ణః. | దాంత పంచవర్ణము. |
|---|---|
| సహస్రపాదః కారండే మా సహస్రపాదః | —(పు) కన్నె లేడుపిట్ట, సూర్యుడు, యజ్ఞపురుషుడు. |
| స్త్రాండే యజ్ఞపూపషే. | |
| భవేదుపనిషద్ధర్మే వేదాంతే ఉపనిషత్ | —(పు) ధర్మము, వేదాంతశాస్త్రము, రహస్యప్రదేశము |
| ఽపి రహస్యపి, | |

| అథ ధాంతో ద్వివర్ణః | ధాంత ద్వివర్ణము. |
|---|---|
| రాధో వైశాఖమాసే స్యా ద్రాధా గోప్యాం చ వి ద్యుతి, విష్ణుక్రాంతామల క్యోశ్చ చిత్రభేదేఽపి ధన్వినాం. ౧. | రాధః—(పు) వైశాఖమాసము, (స్త్రీ) గోపాంగన, మెఱపు, విష్ణుక్రాంతలత, ఉసిరికచెట్టు, విలుకాండ్ర నైపుణ్య విశేషము. |
| గాధఃస్థానే చ లిప్సాయాం | గాధః—(పు) ప్రదేశము, కోరిక. |
| వ్యాధో మృగయు దుష్ట యోః, | వ్యాధః—(పు) కిరాతుడు, దుష్టుడు. |
| మేధః క్రతౌ ధియాం మేధా మేధస్స్యాత్తలదారుణి ౨ | మేధః—(పు) యజ్ఞము, (స్త్రీ) ధారణగల బుద్ధి, (పు) కళ్లమునందలి పశువుల కట్టుటకు పాతినకొయ్య. |
| బుధః కవౌ సురే సౌమ్యే | బుధః—(పు) విద్వాంసుడు, దేవత, బుధగ్రహము. |
| మిద్ధమాలస్యనిద్రయోః, మి ద్ధం చిత్తాభిసంక్షేపే | మిద్ధం—(న) ఆలస్యము, నిద్ర, మైమఱచుట. |
| నద్ధముద్వృత్తబద్ధయోః. ౩. | నద్ధం—(త్రి) మర్యాద నతిక్రమించినది, కట్టఁబడినది. |
| సిద్ధో వ్యాసాదిషు ఖ్యాతః సిద్ధాస్స్యుర్దేవయోనిషు,నిత్యే ప్రసిద్ధే నిష్పన్నే౽ | సిద్ధః—(పు) వ్యాసాదులు, (స్త్రీ) సిద్ధులను దేవయోని విశేషము. (త్రి) నిత్యమైనది, ప్రసిద్ధమైనది, సిద్ధమైనది. |

| | |
|---|---|
| ఇద్ధమాతప్తదీప్తయోః ౭. | ఇద్ధం—(పు) తపింపఁజేయఁబడినది, వెలిగింపఁబడినది. |
| ఋద్ధం త్వతిసమృద్ధే స్యాత్సంపన్నార్థేఽపి వాచ్యవత్, | ఋద్ధం—(న) సమృద్ధమైనది, సాధింపఁబడినది. |
| వృద్ధం తు శైలజే సూరిర్వ రూఢేషు భేద్యవత్. ౫. | వృద్ధం—(న) ఱాతిపువ్వు, (త్రి) విద్వాంసుఁడు, ముసలివాఁడు, వృద్ధినొందినది. |
| విద్ధం స్యాద్వేధితే క్షిప్తే సాదృశ్యే చ నిగద్యతే, | విద్ధం—(త్రి) తొలువఁబడినది. త్రోయఁబడినది, సామ్యమైనది. |
| బుద్ధో జినే చ ధీరే చ సౌమ్యే చ బుధితే త్రిషు. ౬. | బుద్ధః—(పు) బుద్ధదేవుఁడు, విద్వాంసుఁడు, శాంతుఁడు, (త్రి) తెలియఁబడినది. |
| అర్ధః ఖండే సమాంశేఽర్ధం | అర్ధః—(పు) తునుక, సగభాగము (న). |
| లుబ్ధో మృగయుకాంక్షిణోః, | లుబ్ధః—(పు) కిరాతుఁడు, లోభి. |
| అంధం స్యాత్తిమిరే దృష్టిహీనేఽంధస్సముదాహృతః. ౭. | అంధం—(న) అంధకారము, (త్రి) గ్రుడ్డివాఁడు. |
| గంధో గంధక ఆమోదే లేశే సంబంధగర్వయోః, | గంధః—(పు) గంధకము, పరిమళము, స్వల్పము, సంబంధము, గర్వము. |
| స్కంధః ప్రకాండే సైన్యాంశే బాహుమూలసమూహయోః. సమీకనృపయోశ్చాపి | స్కంధః—(పు) చెట్టుమొదలు, సైన్యభాగము, భుజము, సమూహము, ద్వంద్వయుద్ధము, స్కంధుఁడనురాజు. |
| బంధస్త్వాధౌ చ బంధనే, | బంధః—(పు) వ్యాధి, కట్టుట. |
| దగ్ధం ప్లుష్టేఽన్యవద్దగ్ధా స్థితార్కకాశా దర్శితా. ౮. | దగ్ధం—(త్రి) తగులఁబెట్టఁబడినది, (స్త్రీ) సూర్యుఁడున్న దిక్కు. |
| దిగ్ధం విషాక్తబాణే స్యాద్దిగ్ధం లిప్తార్థకేఽన్యవత్, | దిగ్ధం—(న) విషముపూసిన బాణము, (త్రి) పూయఁబడినది. |
| దుగ్ధం ప్రపూరణే క్షీరే | దుగ్ధం—(న) పూరించుట, పాలు. |
| ముగ్ధస్సుందరమూఢయోః. | ముగ్ధః—(త్రి) సుందరమైనది, అవివేకి. |
| మధు క్షౌద్రే జలే క్షీరే మ | మధు—(న) తేనె, ఉదకము, పాలు, |

| | |
|---|---|
| ద్యే పుష్పరసే మధుః, దైతే చైత్రే వసంతే చ జీవశాకే మధుద్రుమే. ౧౧. | కల్లు, మకరందము, (పు) రాక్షసవిశేషము, చైత్రమాసము, వసంతర్తువు, పాలకూర, ఇప్పచెట్టు. |
| విధుశ్శశాంకే కర్పూరే హృషీకేశేఽపి రాక్షసే, | విధుః—(పు) చంద్రుఁడు, కర్పూరము, విష్ణువు, రాక్షసుఁడు. |
| సాధుర్వార్ధుషికే చారౌ సజ్జనే చాభిధేయవత్. ౧౨. | సాధుః—(త్రి) వడ్డిచేజీవించువాఁడు, సుందరమైనది, సజ్జనుఁడు. |
| సింధుస్సముద్రే నద్యాం చ నదే దేశేభదానయోః, | సింధుః— (పు) సముద్రము, (స్త్రీ) నది, (పు) నదము, సింధుదేశము, ఏనుఁగు మదము. |
| బంధుర్బంధూకపుష్పే స్యాద్బంధుర్భ్రాతరి బాంధవే. | బంధుః— (పు) మంకెనచెట్టు, అన్న, చుట్టము |
| ఆధిర్మానసపీడాయాం ప్రత్యాశాయాం చ బంధకే, వ్యసనే చాప్యధిష్ఠానే | ఆధిః—(స్త్రీ) మనస్సునందలి చింత, ఆశ, తాకట్టు, దుఃఖము, ఆశ్రయము. |
| వ్యాధిరామయవాక్యయోః. | వ్యాధిః—(స్త్రీ) రోగము, వాక్యము. |
| బోధిస్సమాధిభేదే స్యాద్బోధిః పిప్పలపాదపే, | బోధిః— (పు) సమాధివిశేషము, రావిచెట్టు. |
| సంధిర్భేదే సురంగాయాం భగేసంఘటనేఽపి చ. ౧౩. | సంధిః—(పు) భేదము, రంధ్రము, యోని, కూర్చుట. |
| అబ్ధిస్సముద్రే సరసి | అబ్ధిః—(పు) సముద్రము, తటాకము. |
| సిద్ధిర్నిష్పత్తియోగయోః, | సిద్ధిః—(స్త్రీ) సిద్ధమగుట, సిద్ధియోగము. |
| వృద్ధిరానందనే ఋద్ధౌ వర్ధనేఽపి కలాంతరే. ౧౪. | వృద్ధిః—(స్త్రీ) సంతోషము, వృద్ధియనునోషధి, వృద్ధినొందుట, వృద్ధికళ. |
| దోగ్ధా గోపాలకే వత్సే కవావర్థోపజీవిని, | దోగ్ధా- (పు) గొల్లవాఁడు, దూడ, విద్వాంసుడు, యాచనవలన బ్రతుకువాఁడు. |
| విధా గజాన్నే ఋద్ధౌ చ ప్రకారే వేతనే విధా. | విధా—(స్త్రీ) ఏనుఁగునకుఁ బెట్టు అన్నము. సమృద్ధి, ప్రకారము, కూలి, [illegible]యుట. |
| గోధా తలే నిహాకాయాం | గోధా— (స్త్రీ) నారిదెబ్బ తగులకుండుటకై చేతికిఁ దొడిగికొను తోలుకవచము |

నీరదునుము.

| | |
|---|---|
| బాధా దుఃఖనిషేధయోః, | బాధా—(స్త్రీ) దుఃఖము, నిషేధించుట. |
| సుధాఽమృతే స్నుహీమూర్వా లేః గాంగేష్టికాసు చ. ౧౦. | సుధా—(స్త్రీ) అమృతము, జెముడుకాడ, చాగచెట్టు, గారసున్నము, లతావిశేషము. |
| సంధా స్థితౌ ప్రతిజ్ఞాయాం | సంధా—(స్త్రీ) ఉనికి, ప్రతిజ్ఞ. |
| శ్రద్ధా శ్రాద్ధత్వకాంక్షయోః, | శ్రద్ధా—(స్త్రీ) ఆదరము, కోరిక. |
| స్పర్ధా సంఘర్షణే సామ్యే స్పర్ధాక్రమసముచ్ఛ్రితౌ. ౧౧. | స్పర్ధా—(స్త్రీ) ఒరయుట, సామ్యము, క్రమముగా వృద్ధినొందుట. |
| వధూస్స్నుషా నవోఢా స్త్రీ భార్యాస్పృక్కాంగనాసు చ, శాట్యాం చ శారిబాయాం చ | వధూః—(స్త్రీ) కోడలు, క్రొత్తగాఁ బెండ్లియైనస్త్రీ, భార్య, స్పృక్కయనుగంధద్రవ్యము, సామాన్యస్త్రీ, నల్లయతివస, సుగంధిపాలచెట్టు, |
| పృథూర్బుద్ధౌ గుదేఽపి చ. | పృథూః—(స్త్రీ) బుద్ధి, గుదప్రదేశము. |

---

| అథ థాంత త్రివర్గః. | థాంత త్రివర్ణము. |
|---|---|
| వివధో వీవధశ్చాపి పర్యాహారేఽధ్వభారయోః, | వివధః, వీవధః —(పు) కావడి, మార్గము, బరువు. |
| విబుధః పండితే దేవే | విబుధః—(పు) విద్వాంసుఁడు, దేవుఁడు. |
| సంబాధస్సంకటే భగే. ౧ | సంబాధః—(పు) సమ్మర్దము, యోని. |
| నిషధః కఠినే దేశే తద్రాజే చ నగాంతరే, | నిషధః—(పు) కఠినము, నిషధదేశము, నిషధరాజు, నిషధపర్వతము. |
| సంరోధో రోధనే క్షేపే | సంరోధః—(పు) అడ్డగించుట, తిరస్కరించుట. |
| నిరోధో రోధనాశయోః. | నిరోధః—(పు) అడ్డగించుట, నాశనము. |
| ఉత్సేధశ్చోచ్ఛ్రయే కాయే | ఉత్సేధః—(పు) ఔన్నత్యము, శరీరము. |
| దుర్విధో దుర్గతే ఖలే, | దుర్విధః—(పు) దరిద్రుఁడు, దుర్మార్గుఁడు. |
| విస్రబ్ధోఽనుల్బణేఽత్యర్థే శాంతప్రసృతయోరపి. | విస్రబ్ధః—(త్రి) అధికముకానిది, అధికము, శాంతమైనది, విస్తరింపఁబడినది. |

న్యగ్రోధో వ్యామవటయో న్యగ్రోధః— (పు) బారెడు, మఱ్ఱిచెట్టు,
ర్న్యగ్రోధశ్చ శమీతరౌ. జమ్మిచెట్టు, (స్త్రీ) అశ్వసరపుచెట్టు, మో
న్యగ్రోధీ వృషపర్ణ్యాం హనమను నోషధి.
చ మోహనాఖ్యౌషధౌ
వపి. ౨౮. [శాఖ్య.

అగాధో వివరే స్థానే అగాధః— (పు) రంధ్రము, లోతుగల
ప్రసిద్ధోఽలంకృతేఽపి చ, ప్రసిద్ధః—త్రి అలంకరింపఁబడినది, ప్రసి
విఖ్యాతేఽపి చ ద్ధమైనది.

సన్నద్ధో వర్మిత వ్యూఢయో సన్నద్ధః— (త్రి) కవచముగలవాఁడు,
రపి. ౨౯ వ్యూహమైన సేన.

ఆనద్ధం బద్ధమాత్రే స్యాదాన ఆనద్ధం—(త్రి) కట్టఁబడినది, మద్దెల మొ
ద్ధం మురజాదికే, దలగునవి.

ఆవిద్ధో వాచ్యవత్ జ్ఞేయః ఆవిద్ధః— (త్రి) వక్రమైనది, కొట్టఁబడి
కుటిలే చ పరాహతే. నది.

కబంధస్తూదరే రక్షోవిశేషే కబంధః—(పు) పొట్ట, కబంధుఁడను రా
ఽపి విధుంతుదే, క్షసుఁడు, రాహుగ్రహము.

ఆబంధో దృఢబంధే స్యా ఆబంధః—(పు) దృఢముగాఁ గట్టుట,
త్ప్రేమాలంకార యోరపి. ౨౭. ప్రేమ, ఆభరణము.

సుగంధిస్స్యాదిష్టగంధే సుగం సుగంధిః—(పు) పరిమళము, (న) నూఁగు
ధిహరివాలుకే, దోసచెట్టు.

ఉపాధిర్ధర్మచింతాయాం కై ఉపాధిః—(పు) ధర్మమైన విచారణ,
తవేఽపి విశేషణే. ౨౮. నెపము, విశేషణము, కుటుంబమున
కుటుంబ వ్యాపృతేఽపి కై పేరము చేయువాఁడు.
స్యా

దుపధి ర్వ్యాజచక్రయోః, ఉపధిః—(పు) మిష, రథచక్రము.

పరిధి ర్యజ్ఞియతరో శ్శాఖా పరిధిః—(పు) యజ్ఞపశువును బంధించు
యాముపసూర్యకే. ౨౯. స్తంభము, సూర్యాదిపరివేషము.

అవధి స్త్వవధానేస్యాత్సీమ్ని అవధిః—(పు) నిషయావధానము,
కాలే బిలేఽపి చ, హద్దు, కాలము, బిలము.

| | |
|---|---|
| సమాధిర్నియమే ధ్యానే నీ<br>వాకే చ సమర్థనే. ౩౦. | సమాధిః—(పు) నియమము, ధ్యానించుట, మాటలాడకుండుట, సిద్ధాంతీకరించుట. |
| సన్నిధిస్సన్నిధానే స్యాదధ్యక్షే<br>దింద్రియగోచరే, | సన్నిధిః—(స్త్రీ) సమీపము, ఇంద్రియములకు గోచరమగుట. |
| సంసిద్ధిస్సహజే సిద్ధౌ మదో<br>ద్రాయామపి స్మృతా. | సంసిద్ధిః— (స్త్రీ) స్వభావము, సిద్ధించుట, మదించిన స్త్రీ. |
| ప్రణిధిశ్చరే యాచ్ఞాయాం | ప్రణిధిః—(పు) చారుడు, యాచన. |
| వీరుద్విటపశాఖయోః, | వీరుత్—(పు) బోదెలేనిచెట్టు. |
| మాగధీ పిప్పలీయూధ్యో ర్మా<br>గధో మగధోద్భవే. ౩౨.<br>వైశ్యజక్షత్రియాపుత్రే<br>శుక్రజీరకవందినోః, | మాగధీ—(స్త్రీ) పిప్పలితీఁగ, అడవిమొల్ల, (త్రి) మగధదేశమునందుఁ బుట్టినది, (పు) వైశ్యునివలన క్షత్రియస్త్రీయందు జన్మించినవాఁడు, తెల్లజిలకఱ్ఱ, స్తోత్రపాఠకుఁడు. |

---

అథ థాంత శ్చతుర్వర్ణః. — థాంత చతుర్వర్ణము.

| | |
|---|---|
| అవరోధస్తిరోధానే శుద్ధాం<br>తే రాజవేశ్మని. ౩౩. | అవరోధః—(పు) కప్పుట, రాణివాసము, రాజగృహము. |
| మహౌషధం శృంగిబేరే వి<br>షాయాం లశునేఽపి చ, | మహౌషధః—(పు) శొంఠి, అతివస, వెల్లుల్లి. |
| పరివ్యాధో వేతసే స్యాత్పరి<br>వ్యాధో ద్రుమోత్పలే | పరివ్యాధః— (పు) నీరుప్రబ్బలిచెట్టు, కొండగోఁగు చెట్టు. |
| అవష్టబ్ధమదూరే స్యాదా<br>క్రాంతే చావలంబితే, | అవష్టబ్ధం—(త్రి) సమీపము, ఆవరింపఁబడినది, ఆశ్రయింపఁబడినది. |
| సమున్నద్ధస్సముద్భూతే పండి<br>తమ్మన్యధృష్టయోః. ౩౪. | సమున్నద్ధం—(త్రి) పుట్టినది, తాను బండితుఁడనుకొనువాఁడు, దుర్మార్గుఁడు. |
| అనిరుద్ధ ఉషానాథే చరే చా<br>నర్గళేఽన్యవత్, | అనిరుద్ధః—(పు) అనిరుద్ధుఁడు, చారుఁడు (త్రి) అడ్డము లేనిది. |
| అనుబంధః ప్రకృత్యాదౌ | అనుబంధః—(పు) ప్రకృతి ప్రత్యయాగ |

దోషోత్పాదే వినశ్వరే.

మూదేశము, దోషముకలుగఁజేయుట,

౩౬. ముఖ్యానుయాయిని శిశౌ ప్రకృతస్యానువర్తనే, అనుబంధీ చ హిక్కాయాం తృష్ణాయామపి కథ్యతే. ౩౭.

ఇత్సంజ్ఞకవర్ణము, ముఖ్యుల ననువర్తించుశిశువు, ప్రకృతముననుసరించుట, (స్త్రీ) ఎక్కిళ్లు, ఆశ.

కాలస్కంధస్తమాలే స్యాత్తిందుకే జీవకద్రుమే,

కాలస్కంధః—(పు) చీకటిమ్రాను, నల్లతుమికి చెట్టు, వేగిసమ్రాను.

ఆశాబంధస్సమాశ్వాసే తథా మర్కటజాలకే. ౩౮.

ఆశాబంధః—(పు) ఊఱడింపు, సాలెపురుగుమగ్గము.

బ్రహ్మబంధురధిక్షేపే నిర్దేశే చ ద్విజన్మనాం,

బ్రహ్మబంధుః—(పు) నిందింపఁబడువాఁడు, బ్రాహ్మణుని నిర్దేశించుట.

ఉగ్రగంధాజమోదాయాం వచాయాం ఛిక్కికౌషధౌ. ౩౯.

ఉగ్రగంధా—(స్త్రీ) ఓమములోభేదము, వస, ఛిక్కికయనునోషధి.

తీక్ష్ణగంధా వచాయాం చ శిగ్రురాజికయోరపి,

తీక్ష్ణగంధా—(స్త్రీ) వస, మునుగచెట్టు, నల్లావాలు.

ఇక్షుగంధా కోకిలాక్షే క్రోష్ట్ర్యాం కాశే చ గోక్షురే. ౪౦.

ఇక్షుగంధా—(స్త్రీ) గొలిమిడిచెట్టు, నేలగుమ్ముడు, రెల్లు, ఏనుఁగుపల్లేరు.

తృణగోధా చిత్రకోలే కృకలాసే చ లక్ష్యతే,

తృణగోధా—(స్త్రీ) జంతువిశేషము, తొండ.

ఉపలబ్ధిర్మతౌ ప్రాప్తౌ జ్ఞానే చాపి ప్రయుజ్యతే. ౪౧.

ఉపలబ్ధిః—(స్త్రీ) బుద్ధి, పొందుట. జ్ఞాపకము.

---

అథ ధాంత పంచవర్ణః.

ధాంత పంచవర్ణము.

యోజనగంధా కస్తూర్యాం సీతాయాం వ్యాసమాతరి,

యోజనగంధా—(స్త్రీ) కస్తూరి, సీతాదేవి, సత్యవతి.

---

| అథ నాంతవర్గః. | నాంతవర్గము. |
| --- | --- |
| ఇనస్సూర్యే నృపే పత్యౌ | ఇనః—(పు) సూర్యుఁడు, రాజు, భర్త. |
| ధనం గోధనవిత్తయోః, | ధన—(న) పశుసంపద, ద్రవ్యము. |
| జినస్స్యాదతివృద్ధే చ బుద్ధే చార్హతి జిత్వరే. ౧. | జినః—(పు) మిక్కిలిముసలివాఁడు, బుద్ధుఁడు, (త్రి) పూజ్యుఁడు, జయశీలుఁడు. |
| జనో లోకే మహర్లోకాత్పరలోకే చ పామరే, జనీ సీమంతినీ వధ్వోరుత్పత్తౌ చ జనిర్మతా. ౨. | జనః—(పు) జనము, జనుర్లోకము, మూర్ఖుఁడు, (స్త్రీ) స్త్రీ, భార్య, పుట్టుక. |
| ఘనం స్యాత్కాంస్యతాళాది వాద్యమధ్యమనృత్యయోః, ఘనం సాంద్రే దృఢే ధార్ఢ్యే విస్తారే లోహముద్గరే. ౩. మేఘముస్తకయోశ్చాపి | ఘనం—(న) కంచుతాళములవాద్యము, ఒకవిధమగునాట్యము, (త్రి) దట్టమైనది, దృఢమైనది, (పు) బలముగలది, విశాలమైనది, ఇనుపగుదియ, మేఘము, తుంగముస్తె. |
| వనం కాననసీరయోః, ప్రవాసే నిలయేచాపి వనం ప్రస్రవణేఽపి చ. ౪. | వనం—(న) అడవి, జలము, పరదేశవాసము, గృహము, కొండకాలువ. |
| వానం శుష్కఫలే శుష్కే కటే సీవనకర్మణి, జలసంప్రవవాతోర్మి సురంగాగతిసౌరభే. ౫. | వానం—(త్రి) ఎండినకాయ, ఎండినవస్తువు, గండస్థలము, కుట్టుట, నీటిపట్టునుండి వీచుగాలి, సొరంగము, గమనము, సుగంధము. |
| దానం గజమదే త్యాగే పాలనచ్ఛేదశుద్ధిషు. | దానం—(న) ఏనుఁగుమదము, ఇచ్చుట, పరిపాలించుట, ఛేదించుట, పరిశుద్ధి. |
| మానం ప్రమాణే ప్రస్థాదౌ మానశ్చిత్తోన్నతౌ గ్రహే. ౬. | మానం—(న) పరిమితి, మానిక, (పు) గర్వము, గ్రహము. |
| యానం గతౌ వాహనేఽపి | యానం—(న) గమనము, గజాందోళికాదులు. |
| పానం పీతౌ చ రక్షణే, | పానం—(న) త్రాఁగుట, రక్షించుట. |

| | |
|---|---|
| స్త్యానం స్నిగ్ధే ప్రతిధ్వానే ఘనత్వాలస్యయోరపి.౭. | స్త్యానం—(న)నున్నని, ప్రతిధ్వని, గొప్పతనము, ఆలస్యము. |
| స్థానం స్థితౌ చ సాదృశ్యే సన్నివేశావకాశయోః, | స్థానం—(న) ఉనికి, సామ్యము, నివాసస్థానము, అవకాశము. |
| యుక్తార్థే కరణార్థే చ స్థానే స్యాదవ్యయం పునః. | స్థానే—(అవ్యయం) యుక్తము, హేతువు. |
| సూనం వాచ్యవదూనేషు సూనం ప్రసవపుష్పయోః, సూనా పుత్ర్యాం వధస్థాన గళశుండికయోరపి.౯. | సూనం—(త్రి) స్వల్పమైనది, (న) కాన్పు, పూవు, (స్త్రీ)కుమార్తె, మృగాదులఁ జంపుప్రదేశము, కొండనాలుక |
| ఊనం హీనే రణోద్యోగే | ఊనం—(న) తక్కువ, యుద్ధప్రయత్నము. |
| స్యూనః కిరణసూర్యయోః, | స్యూనః—(పు) కిరణము, సూర్యుఁడు. |
| మీనో రాశ్యంతరే మత్స్యే | మీనః—(పు) మీనరాశి, చేప |
| శీనోஉజగరమూర్ఖయోః.౧౦ | శీనః—(పు) కొండచిలువ, మూర్ఖుఁడు. |
| చీనో మృగాంతరే తంతువ్రీహిదేశాంశుకాంతరే, | చీనః—(పు) మృగవిశేషము, దారము, చీనమను ధాన్యము, చీనాదేశము, చీనాంబరము. |
| హీనంగర్హ్యోనయోర్న్యూనమనయోరపి కీర్తితం. | హీనం, న్యూనం—(త్రి) నిందింపఁదగినది, తక్కువదైనది. |
| కృత్స్నం కుక్షౌ సమస్తే చ | కృత్స్నం—(న) ఉదరము, సమస్తము. |
| రస్నస్తిక్తకచండయోః, | రస్నః—(పు) వస్త్రవాఁడు, [illegible]ముగలవాఁడు. |
| వస్నం స్యాద్వేతనే మూల్యే వసనద్రవ్యయోరపి.౧౨. | వస్నం—(న) కూలి, వెల, వస్త్రము, ధనము. |
| స్వప్నస్సుప్తస్య విజ్ఞానే స్వప్నస్స్వాపే చ దర్శనే, | స్వప్నః—(పు) కల, నిద్ర, చూచుట. |
| బుధ్నశ్శిఫాయాం రుద్రే చ | బుధ్నః—(పు) చెట్టువేరు, శివుఁడు. |
| రత్నం శ్రేష్ఠే మణావపి.౧౩. | రత్నం—(న) సజాతీయములలో శ్రేష్ఠము, మణి. |

| | |
|---|---|
| నగ్నోఽపి చ క్షపణకే వివస్త్రే చాభిధేయవత్, | నగ్నః— (పు) క్షపణమతస్థుఁడు, (త్రి) వస్త్రహీనుఁడు. |
| లగ్నం రాశ్యుదయే లగ్నం సక్తలజ్జితయోరపి. ౧౪. | లగ్నం— (న) మేషాదిరాసులయుదయము, (త్రి) కలిసినది, సిగ్గునొందినవాఁడు. |
| ఛన్నం రహశ్ఛాదితయోః | ఛన్నం— (న) రహస్యము, (త్రి) కప్పఁబడినది. |
| స్యాదన్నం భుక్తభక్తయోః, | అన్నం— (త్రి) భక్షింపఁబడినది, అన్నము. |
| భిన్నమన్యార్థవచనే సంగతే దారితే స్ఫుటే. ౧౫. | భిన్నం— (త్రి) వేఱైనది, కూడుకొన్నది, ఛేదింపఁబడినది, వికసించినది. |
| విన్నం జ్ఞాతే స్థితే లబ్ధే | విన్నం— (త్రి) తెలియఁబడినది, ఉన్నది, పొందఁబడినది. |
| ఛిన్నం భిన్నే తు వాచ్యవత్, ఛిన్నామృతాయాం పుంశ్చల్యాం | ఛినం— (త్రి) ఛేదింపఁబడినది, (స్త్రీ) తిప్పతీఁగె, అంకుటాలు. |
| మున్నః క్లిన్నే చ సూరతే. | ఉన్నః— (త్రి) తడిసినది, దయగలవాఁడు. |
| చిహ్నం ధ్వజే పతాకాయాం | చిహ్నం— (న) గురుతు, జెండా. |
| ద్యుమ్నం విత్తే పరాక్రమే, | ద్యుమ్నం— (న) ధనము, పోటరితనము. |
| ధనుస్సంజ్ఞా ప్రియాళుద్రౌ రాశిభేదే శరాసనే. ౧౬. | ధనుః— (న) మోరటచెట్టు, ధనూరాశి, విల్లు. |
| తనుః కాయే కృశే చాల్పే విరళేఽపిచ వాచ్యవత్, | తనుః— (స్త్రీ) శరీరము, (త్రి) కృశించినది, అల్పమైనది, విరళమైనది. |
| హనుః ప్రహరణే మృత్యౌ కపోలావయవే గదే. ౧౭. | హనుః— (స్త్రీ) దెబ్బ, మృత్యువు, దవడ, రోగము, బెత్తము. |
| హనుర్హట్టవిలాసిన్యాం | |
| సూనుః పుత్రేఽనుజే రవౌ, | సూనుః— (పు) కుమారుఁడు, తమ్ముఁడు, సూర్యుఁడు. |
| సానుశ్శృంగే బుధే మార్గే వాత్యాయాం పల్లవే వనే. ౧౮. | సానుః— (పు) శిఖరము, విద్వాంసుఁడు, త్రోవ, వాయుసంఘము, చిగురు, వనము. |
| దానుర్దాతరి విజ్ఞాతే | దానుః— (త్రి) దాత, తెలియఁబడినది. |
| భానుః కిరణసూర్యయోః, | భానుః— (పు) కిరణము, సూర్యుఁడు. |

ఫేనస్సముద్రే నద్యాంతు ఫేనీ — ఫేనః—(పు) సముద్రము, (స్త్రీ) నది.

శ్యేనస్సితే ఖగే. ౨౦. — శ్యేనః—(త్రి) తెల్లనిది, డేఁగ.

మునిర్వ్యమీంగుదీ బుద్ధప్రియాళాగస్తికింశుకే, — మునిః—(పు) మునీశ్వరుఁడు, గారచెట్టు, బుద్ధుఁడు, మొఁగటిచెట్టు, అవిసెచెట్టు, మోదుగుచెట్టు.

జ్యానిర్హానౌ స్రవంత్యాంచ — జ్యానిః—(స్త్రీ) హాని, నది.

యోనిస్స్యాదాకరే భగే. — యోనిః—(పు) స్థానము, భగము.

జ్యోత్స్నీ పటోలికాయాం స్యాజ్జ్యోత్స్నాయుక్తవిభావరౌ, — జ్యోత్స్నీ—(స్త్రీ) పొట్లచెట్టు, వెన్నెల రాత్రి.

జ్యోత్స్నా సచంద్రనక్షత్రే రాత్రౌ చంద్రాతపేఽపి చ. — జ్యోత్స్నా—(స్త్రీ) చంద్రునితోఁగూడిన రాత్రి, వెన్నెల.

రాస్నా స్మృతా భుజంగాక్ష్యామేలాపర్ణ్యాంచ కథ్యతే, — రాస్నా—(స్త్రీ) సర్పాక్షీచెట్టు, సన్నరాష్ట్రము.

మృత్స్నా తు వరికాయాం స్యాన్మృత్స్నాయామపి దృశ్యతే. ౨౩. — మృత్స్నా—(స్త్రీ) తువరిమన్ను, శ్రేష్ఠమగుమన్ను.

దీనా మూషికయోషాయాం దుర్గతే కాతరేఽన్యవత్, — దీనా—(స్త్రీ) ఆఁడెలుక, (త్రి) దరిద్రుఁడు, భయపడువాఁడు.

ధానా భృష్టయవే ప్రోక్తా ధాన్యాకేఽభినవోద్భిది. — ధానా—(స్త్రీ) వేపుడుబియ్యము, ధనియము, క్రొత్తవిత్తనము.

---

## అథ నాంత త్రివర్గః. — నాంత త్రివర్గము.

అవనం రక్షణే ప్రీతౌ — అవనం—(త్రి) రక్షించుట, తృప్తినొందుట.

భవనం భావవేశ్మనోః — భవనం—(న) అభిప్రాయము, గృహము,

భువనం విష్టపే మహ్యాం సలిలేఽపి వియత్యపి. ౨౪. — భువనం—(న) లోకము, భూమి, జలము, ఆకాశము.

సవనం యజనే స్నానే సోమ — సవనం—(న) యజ్ఞము, స్నానము, సోమ [పానము

నిర్గళనేఽపి చ,

| | |
|---|---|
| అయనం పథి భానోస్స్యాదు దగ్దక్షిణతో గతౌ. | అయనం—(న) మార్గము, దక్షిణోత్తరాయణములు. |
| జయనం స్యాత్తురంగాదిసన్నాహే విజయేఽపి చ, | జయనం—(న) అశ్వాదుల కవచము, జయము. |
| శయనం సురతే నిద్రాశయ్యా యోరభిభాషితం. | శయనం—(న) సంభోగము, నిద్ర, పాన్పు. |
| శమనం శాంతివధయోశ్శమనశ్శ్రాద్ధదైవతే, | శమనం—(న) ఓరిమి, చంపుట, (పు) యముఁడు. |
| దశనః కవచే దంతే దశనశ్శిఖరేఽపి చ | దశనః—(పు) కవచము, దంతము, అగ్రము. |
| జఘనం కామినీశ్రోణిపురోభాగే కటీరకే, | జఘనం—(న) స్త్రీలకటిముందుభాగము, మొల. |
| తపనస్తరణౌ తాపే భల్లాతే నరకాంతరే. | తపనః—(పు) సూర్యుఁడు, వేడిమి, జీడిచెట్టు, నరకవిశేషము. |
| రసనం స్వాదనే ధ్వానే రసనా కాంచిజిహ్వయోః, రసనా చాపి రాస్నాయాం | రసనం—(న) రుచించుట, ధ్వని, (స్త్రీ) మొలనూలు, నాలుక, సన్నరాష్ట్రము, |
| వసనం ఛాదనేఽంశుకే. | వసనం—(న) కప్పుట, వస్త్రము. |
| హసనం చ స్మితే హాసేఽంగారధానాన్యాం హసన్యపి, | హసనం—(న) చిఱునగవు, నవ్వు, (స్త్రీ) కుంపటి. |
| శ్వసనో మారుతే శ్వాసే శ్వసనో మదన ద్రుమే. | శ్వసనః—(పు) వాయువు, నిట్టూర్పు, మ్రంగ చెట్టు |
| కదనం మర్దనే పాపే | కదనం—(న) మర్దించుట, పాపము. |
| సదనం మందిరే జలే. | సదనం—(న) గృహము, జలము. |
| మదనః స్మరధుత్తూర వసంత ద్రుమసిక్థకే. | మదనః—(పు) మన్మథుఁడు, ఉమ్మెత్త చెట్టు, వసంతఋతువు, మ్రంగ చెట్టు, మైనము. |
| దహనశ్చిత్రకే వహ్నౌ భల్లాతే దుష్టచేష్టితే, | దహనః—(పు) చిత్రమూలపు చెట్టు, అగ్ని, జీడిచెట్టు, (త్రి) దుష్టవ్యాపారముగలవాఁడు. |

| | |
|---|---|
| గహనం గహ్వరే దుఃఖే విపి గహనే కలిలేఽపి చ. ౩౩ | గహనం—(న) గుహ, దుఃఖము, అరణ్యము, (త్రి) ప్రవేశింపరానిది. |
| స్తవనం ధ్వనిమాత్రే స్యాత్కుంఠనే మేఘగర్జితే, | స్తవనం—(న) ధ్వని, మొక్కపోవుట, మేఘధ్వని. |
| నిధనం స్యాత్కులే నాశే | నిధనం—(న) కులము, నాశనము. |
| ప్రధనం దారణే రణే ౩౪ | ప్రధనం—(న) చేధించుట, యుద్ధము. |
| పవనాఖ్యా కులాలస్య పాకస్థానేఽపిమారుతే,నిష్పావే | పవనః—(పు) ఆవము, వాయువు, తూర్పారఁబట్టుట. |
| చాథ వపనం బీజాధానేఽపి ముండనే. ౩౫. | వపనం—(న) విత్తనములుచల్లుట, క్షౌరము. |
| దమనః కుసుమే వీరే | దమనః—(పు) దవనము, వీరుఁడు. |
| వమనశ్ఛర్దనేఽర్దనే, స్యాదాహృతౌ చ | వమనః—(పు) క్రక్కుట, పీడించుట, సంగ్రహించుట |
| యమనం దుఃఖే చోపరతే యమే. ౩౬. | యమనం—(న) దుఃఖము, విరమించుట, ఇంద్రియనిగ్రహము. |
| కమనః కాముకే కామేఽభిరూపేఽశోకపాదపే, | కమనః—(పు) కామముగలవాఁడు, మన్మథుఁడు, అశోకపుచెట్టు. |
| ధమనోఽప్యనలే భస్త్రాధ్మాపకక్రూరయోరపి. ౩౭. ధమనీ తు హారిద్రాయాం కంధరాశిరయోరపి, | ధమనః—(పు) అగ్ని, తిత్తి ఊదువాఁడు, క్రూరుఁడు, (స్త్రీ) పసుపు, కంఠము, బోలునరము. |
| మలనః పటవాసే స్యాన్మర్దనే మలనం మతం. ౩౮. | మలనః—(పు) డేరా, (న) మర్దించుట. |
| చలనం కంపనం కంపే కంప్రే చలనకంపనౌ, | చలనం, కంపనం—(న) చలించుట, చలించునది. |
| చలనీ వస్త్రఘర్ఘర్యాం వారిభేదేఽపి చ క్వచిత్. ౩౯. | చలనీ—(స్త్రీ)లంగా, గజబంధనవిశేషము. |
| సేచనం రక్షణే సేకే నౌకాసేచనభాజనే, | సేచనం—(న) కాపాడుట, తడుపుట, ఓడలోని నీరుతోడు పాత్రము. |
| సేవనం సీవనోపాస్త్యో | సేవనం—(న)కుట్టుట, సేవించుట. |

| | |
|---|---|
| సంవ్యానం ఛాదనే ఽంశుకే. ౪౦. | సంవ్యానం—(న) కప్పుట, ఉత్తరీయ వస్త్రము. |
| సమానం సత్సమైకేషు సమానో నాభిమారుతే, | సమానం—(త్రి) యోగ్యమైనది, సమానమైనది, ఒక్కటైనది, (పు) సమానమను వాయువు. |
| శోభనో గ్రహయోగే స్యాచ్ఛోభనో సుందరేఽన్యవత్. ౪౧ | శోభనః—(పు) శోభనయోగము, (త్రి) సుందరము. |
| శాసనం రాజదత్తోర్వ్యాం లేఖాజ్ఞాశాస్త్రశాసిషు, | శాసనం—(న) రాజుచే నొసంగఁబడిన భూమి, జాబు, ఆజ్ఞ, శాస్త్రము, శిక్ష. |
| వాసనం వసనే వీరాసనే జ్ఞానే చ ధూపనే. ౪౨. | వాసనం—(న) వస్త్రము, వీరాసనము, జ్ఞానము, వాసనపట్టుట. |
| ఆసనం ద్విరదస్కంధే పీఠే యాత్రానివర్తనే, ఆసనీ పణ్యవీథ్యాం స్యాదాసనో జీవద్రుమే. ౪౩. | ఆసనం—(న) ఏనుఁగుమూఁపు, పీఠము, దేశకాలముల ననుసరించి యుద్ధయాత్రమానుట, (స్త్రీ) అంగడివీథి, (పు) వేగిసచెట్టు. |
| స్పర్శనో మారుతే స్పర్శదానయోస్స్పర్శనం మతం, | స్పర్శనః—(పు) వాయువు, (న) స్పృశించుట, ఈవి. |
| దర్శనం నయనస్వప్నబుద్ధిధర్మోపలబ్ధిషు ౪౪. శాస్త్రే దర్పణయోశ్చాపి | దర్శనం—(న) నేత్రము, స్వప్నము, బుద్ధి, ధర్మము, జ్ఞానము, శాస్త్రము, అద్దము. |
| దంశనం దంశవర్మణోః, | దంశనం—(న) కొఱకుట, కవచము. |
| పిశునం కుంకుమే క్రూరే సూచకే చాభిధేయవత్. ౪౫ | పిశునం—(న) కుంకుమ, (త్రి) క్రూరమైనది, కొండెగాఁడు. |
| శకునం చ శుభాశంసానిమిత్తే శకునః ఖగే, | శకునం—(న) శుభమునుసూచించు నిమిత్తము, (పు) పక్షి. |
| మిథునో రాశిభేదే స్యాన్మిథునం సంగతిద్వయే. ౪౬ | మిథునః—(పు) మిథునరాశి, (న) భార్యాభర్తలు. |
| తలునః పవనే యూని స్త్రియాం చ తలునీ విదుః, | తలునః—(పు) వాయువు, పిన్నవయస్సువాఁడు, (స్త్రీ) యౌవనవతి. |

తలినం విరళే స్తోకే స్వచ్ఛేఽపి తలినం మతం. ౪౭.
తలినం—(త్రి) విరళమైనది, స్వల్పమైనది, నిర్మలమైనది.

మలినం దూషితే కృష్ణే ఋతుమత్యాం మలిన్యపి,
మలినం—(త్రి) దూషింపఁబడినది, నల్లనిది, మలినీ, (స్త్రీ) ముట్టుది.

కఠినం నిష్ఠురే స్థాల్యాం శర్కరాయాం గుడస్య చ. కఠినా కాటికాయాం చ కఠినీతి ప్రయుజ్యతే,
కఠినం—(త్రి) కఠినమైనది, (స్న) పాత్రము, (స్త్రీ) పంచదార, కఠినీ,(స్త్రీ) హారిదళము మణిశిల మున్నగు ధాతువులు.

పీతనం హారితాళే స్యాత్కుంకుమే పీతదారుణి. ౪౮. ఆమ్రాతకే పీతనశ్చ హరిద్రాయాం చ పీతనా, పీతనం త్రిషు పీతేఽపి
పీతనం—(న) హారిదళము, కుంకుమ, (పు) దేవదారుచెట్టు, అంబాళవృక్షము, (స్త్రీ) పసుపు, (త్రి) పచ్చని పదార్థము.

మైథునం సంగతే గతే. ౫౦.
మైథునం—(న) సంబంధము, సంభోగము.

కేతనం లాంఛనే కార్యే గేహే చోపనిమంత్రణే,
కేతనం—(న) చిహ్నము, చేయఁదగినపని, గృహము, పిలుచుట.

ఛర్దనోఽలంబుషే నింబే ఛర్దనం వమనేఽపి చ. ౫౧.
ఛర్దనః—(పు) చిట్టికూర, వేఁపచెట్టు, (న) వమనము.

ఛేదనం కర్తనే భేదే
ఛేదనం—(న) నఱుకుట, భేదించుట.

ఛదనం పక్షపత్రయోః,
ఛదనం—(న) ఱెక్క, ఆకు.

తోదనం వ్యథనే తోత్త్రే
తోదనం—(న) బాధ, కొరడా.

రోదనం క్రందనేఽశ్రుణి. ౫౨
రోదనం—(న) ఏడ్చుట, కన్నీరు.

అపానం తు గుదే ప్రోక్తమపానస్తస్య మారుతే,
అపానం—(న) గుదము, (పు) అపానవాయువు.

సంతానస్సంతతౌ గోత్రే స్యాదపత్యే సురద్రుమే ౫౩.
సంతానః—(పు) పుత్రపౌత్ర పారంపర్యము, కులము, బిడ్డ, కల్పవృక్షము.

వితానో యజ్ఞవిస్తారోల్లోచేషు క్రతుకర్మణి, వృత్తభేదావసరయో ర్వితానం తుచ్ఛమందయోః. ౫౪.
వితానః—(పు) యజ్ఞము, విస్తారము, చాందిని, యజ్ఞకర్మము, (న) వృత్తవిశేషము, సమయము, (త్రి) నీచమైనది, మందమైనది.

| | |
|---|---|
| ఉత్తానం స్యాదగంభీరే తథా సుప్తోన్ముఖేఽన్యవత్, | ఉత్తానం—(త్రి) లోతులేనిది, ఊర్ధ్వముఖముగా శయనించునది. |
| ఆదానం గ్రహణే విద్యాదలంకారేఽపి వాజినాం. | ఆదానం—(న) గ్రహించుట, అశ్వమునలంకరించుట. |
| నిదానం కారణే రోగనిర్ణయే వత్సదామని, | నిదానం—(న) కారణము, రోగనిర్ణయము, దూడనుకట్టు కన్నెత్రాడు. |
| ఉద్యానం వనభేదే స్యాన్నిస్సృతేఽపి ప్రయోజనే | ఉద్యానం—(న) శృంగారవనము, వెడలుట, ప్రయోజనము. |
| అమ్లానో ఝింటికాభేదే వాచ్యవన్నిర్మలే స్మృతః, | అమ్లానః—(పు) పెద్దగోరంట, (త్రి) నిర్మలమైనది. |
| వ్యుత్థానం స్వైరకరణే విరోధాచరణేఽపి చ. ౫౭. | వ్యుత్థానం—(న) స్వతంత్రకార్యము, విరుద్ధముగాఁజేయుట. |
| ఉత్థానముద్యమే తంత్రే పౌరుషే పుస్తకే రణే, అంగణోద్గమహర్షేషు మలవేగేఽపి కీర్తితం. ౫౮. | ఉత్థానం—(న) ప్రయత్నము, రాజ్యతంత్రవిచారణ, పురుషకారము, పుస్తకము, యుద్ధము, ముంగిలి, బయలుదేరుట, సంతోషము, మలవిసర్జనము. |
| సంస్థానమాకృతౌ మృత్యౌ సన్నివేశే చతుష్పథే, | సంస్థానం—(న) ఆకారము, మరణము, నగరముచుట్టునుండుప్రదేశము, నాలుగుత్రోవలుగలియుచోటు. |
| ధావనం ప్రగమే శుద్ధౌ స్త్రీ పృశ్నిపర్ణ్యాం తు ధావనీ. | ధావనం—(న) పరుగెత్తుట, పరిశుద్ధి, (స్త్రీ) కోలపొన్నచెట్టు. |
| పావనం తు జలే కృచ్ఛ్రే పావకాధ్మానయోరపి, పావనస్సిల్హకే వహ్నౌ ప్రాయశ్చిత్తే చ పావనం. ౬౦. వాచ్యవత్పావయితరి హరీతక్యాం తు పావనీ, | పావనం—(న) జలము, కృచ్ఛ్రవ్రతము, పరిశుద్ధి, వాతరోగము, (పు) అందుకు బంకతోఁజేసినధూపద్రవ్యము, అగ్ని, ప్రాయశ్చిత్తము, (త్రి) పవిత్రముగావించునది, పావనీ, (స్త్రీ) కరకచెట్టు |
| వామనోఽంకోటవైకుంఠఖర్వదక్షిణదిగ్గజే. ౬౧. | వామనః—(పు) ఊడుగుచెట్టు, విష్ణువు, పొట్టివాఁడు, దక్షిణదిగ్గజము |

| | |
|---|---|
| స్థాపనం స్యాత్పుంసవనేసమాధా రోపణేఽపి చ, | స్థాపనం—(న)పుంసవనకర్మము, సమాధి, ఆరోపించుట. |
| యాపనం వర్తనే కాలక్షేపే నిరసనేఽపి చ. ౬౨. | యాపనం—(న) వ్యాపారము, కాలము జరుపుట, తిరస్కారము. |
| యుంజానస్సారథౌ విప్రే | యుంజానః—(పు) సారథి, బ్రాహ్మణుఁడు. |
| బుధానః పండితే గురౌ, | బుధానః—(పు) విద్వాంసుఁడు, బృహస్పతి. |
| దృశానం జ్యోతిషి ప్రోక్తం దృశానశ్చ విరోచనే. ౬౩ | దృశానం—(న) కాంతి, (పు) సూర్యుఁడు. |
| జవనో దేశభేదే స్యాద్వేగవే గాధికాశ్వయోః, జవనోష్యపధిభేదే స్యాద్వాచ్యవద్వేగిని స్మృతం. | జవనః—(పు) యవనదేశము, వేగము, వేగవంతమగుగుఱ్ఱము, జవనీ, (స్త్రీ) ఓషధివిశేషము, (త్రి) వేగముగలది. |
| జీవనం వర్తనే నీరే పుత్రజీవే తు జీవనః, | జీవనం—(న) వృత్తి, నీరు, (పు) పుత్రజీవిచెట్టు. |
| జీవనీ జీవనా చేతి జీవంతీ మేదయోః క్రమాత్. ౬౪. | జీవనీ, జీవనా —(స్త్రీ) (క్రమముగా) పాలకూర, మేధయనుగంధద్రవ్యము. |
| దేవనం వ్యవహారే స్యాజ్జిగీషాక్రీడయోరపి, అక్షేషు దేవనః ప్రోక్తో | దేవనం—(న) వ్యవహారము, జయించు కోర్కి, ఆట, (పు) పాచికెలు. |
| మేహనం మూత్రశిశ్నయోః. | మేహనం—(న) మూత్రము, శిశ్నము. |
| తేమనం వ్యంజనే క్లేదే తేమనీ చుల్లికాంతరే, | తేమనం—(న) పులుసు, తడుపుట, తేమనీ (స్త్రీ) పొయ్యి. |
| సావనో యజ్ఞకర్మాంతే యజమానప్రచేతసోః. ౬౭. | సావనః—(పు) యాగాంతము, యజ్ఞము చేసినవాఁడు, వరుణదేవుఁడు. |
| విజ్ఞానం కార్మణే జ్ఞానే | విజ్ఞానం—(న) స్తంభన మోహనాది క్రియలు, శిల్పాదిజ్ఞానము. |
| ప్రజ్ఞానం లాంఛనే ధియి, | ప్రజ్ఞానం—(న) చిహ్నము, బుద్ధి. |
| హాయనోఽర్చిషి వర్షే చ వ్రీ | హాయనః—(పు) అగ్నిజ్వాల, సంవత్సర |

హింభేదే చ హాయనః. — ము, ధాన్యవిశేషము.

ఫాల్గునస్తు తపస్యేఽపి పూర్ణిమాయాం తు ఫాల్గునీ,
ఫాల్గునః—(పు) ఫాల్గునమాసము, ఫాల్గునీ, (స్త్రీ) ఫాల్గునమాసపూర్ణిమ,

ఫల్గునః కిథలః పార్థే నదీజే కకుభేఽపి చ. ౬
ఫల్గునః—(పు) అర్జునుడు, బ్రహ్మామేడిచెట్టు, మద్దిచెట్టు

వేష్టనం కర్ణశష్కుల్యాముష్ణీషే పరివారణే,
వేష్టనం—(న) చెవివెలుపలిభాగము, తలపాగా, చుట్టుకొనుట.

గోస్తనో హారభేదేఽపి ద్రాక్షాయామపి గోస్తనీ.
గోస్తనః—(పు) నలువదినాలుపూసల సరము, గోస్తనీ, (స్త్రీ) ద్రాక్షతీగ.

కల్పనం కల్పనే క్లృప్తే సజ్జనాయాం తు కల్పనా.
కల్పనం—(న) ఛేదించుట, రచించుట, (స్త్రీ) ఆయత్తము చేయుటకై యేనుంగునకు గట్టు నిడుత్రాడు.

కర్తనం ఛేదనే ప్రాహుర్నారీణాం తూలసూత్రణే. ౭
కర్తనం—(న) కత్తిరించుట, స్త్రీలు ప్రత్తినూలువడకుట.

లంఘనం తూపవాసే స్యాత్క్రమణే ప్లవనేఽపి చ,
లంఘనం—(న) లంకణము, నడుచుట, ఎగిర దాటుట.

మండనం స్యాదలంకారేఽలంకరిష్ణౌ తు వాచ్యవత్.
మండనం—(న) అలంకారము, (త్రి) అలంకరించునది.

ఖండనం కవచే యుద్ధే ఖలీకారేఽపి వస్తుత,
ఖండనం—(న) కవచము, యుద్ధము, అపకారము.

ముండనం వపనే త్రాణే
ముండనం—(న) క్షౌరము, రక్షణము.

హిండనం లేఖనే రతౌ. ౭
హిండనం—(న) వ్రాయుట, సంభోగము.

అంగనం ప్రాంగణే యానే కామిన్యామంగనా మతా, కుబేరకకరిణ్యామప్యంగనా పరికీర్తితా.
అంగనం—(న) ముంగిలి నడచుట, (స్త్రీ) స్త్రీ, ఉత్తరదిగ్గజము భార్య.

గంధనం సూచనోత్సాహహింసనేషు ప్రకాశనే,
గంధనం—(న) తెలుపుట, ఉత్సాహము, బాధించుట, ప్రకాశించుట.

నందనం వాసవోద్యానే నం
నందనం—(న) నందనవనము, (పు) సం

| | |
|---|---|
| దనో హార్షకే సుతే. ౭౫ | తోషము, పుత్రుఁడు |
| స్యందనం తు స్రుతే నీరే స్యందనస్తినిశే రథే, | స్యందనం—(న) స్రవించుట, జలము, (పు) నెమ్మిచెట్టు, రథము. |
| క్రందనం రోదనేఽఽహ్వానే | కందనం—(న) ఏడ్చుట, పిలుచుట. |
| చందనం మలయోద్భవే ౭౬. చందనః కపిభేదే స్యాన్నదీభేదే తు చందనీ, | చందనం—(న) మంచిగంధము, (పు) చందనుఁడను వానరుఁడు, చందనీ, (స్త్రీ) నదీవిశేషము |
| వర్ధనం ఛేదనే వృద్ధౌ వారిధానాన్యాం చ వర్ధనీ. ౭౭. | వర్ధనం—(న) నఱుకుడు, వృద్ధినొందుట, వర్ధనీ, (స్త్రీ) జలపాత్రము (కూజా) |
| వ్యంజనం తేమనే చిహ్నే శ్మశ్రుణ్యవయవేఽపి చ, | వ్యంజనం—(న) పులుసు మొదలగునవి, చిహ్నము, గడ్డము మీసములు, అవయవములు. |
| రంజనో రాగజనకే రంజనం రక్తచందనే. ౭౮. గుంద్రారోచనికానీలీ మంజిష్ఠాసు చ రంజనీ, | రంజనః—(పు) అనురాగము కలిగించువాఁడు, (న) రక్తచందనము, రంజనీ, (స్త్రీ) ప్రేంకిణపుచెట్టు, గోరోచనము, నీలిచెట్టు, మంజిష్ఠ. |
| అంజనం కజ్జలే చాక్తౌ సౌవీరే చ రసాంజనే. ౭౯. అంజనో దిగ్గజే జ్యేష్ఠ్యా మంజనాప్యనిలస్త్రియాం, అంజనీ లేపనాయాం చ | అంజనం—(న) కాటుక, కలుపుట, సౌవీరాంజనము, రసాంజనము, (పు) పశ్చిమదిగ్గజము, బల్లి, (స్త్రీ) అంజనాదేవి, అంజనీ, (స్త్రీ) పూతపూయుట. |
| గృంజనస్తు రసోనకే. ౮౦. విషదిగ్ధపశోర్మాంసే గృంజనం చ ప్రకీర్తితం, | గృంజనః—(పు) వెల్లుల్లి, (న) విషము పూదిగిన పశుమాంసము |
| లేఖనం ఛర్దనే భూర్జే లిపిన్యాసే చ లేఖనం. ౮౧. | లేఖనం—(న) వమనము, భూర్జపత్రిచెట్టు, వ్రాత. |
| యోజనం చ చతుష్క్రోశ్యాం యోగే చ పరమాత్మని, | యోజనం—(న) ఆమడ, కూడిక, పరమాత్మ. |
| గర్జనం నిస్వనే కోపే | గర్జనం—(న) ధ్వని, కోపము, |

వర్జనం త్యాగహింసయోః. వర్జనం—(న) విడుచుట, చంపుట,
మార్జనం కథితం మార్ష్టౌ మార్జనం—(న) తుడుచుట, (పు) లొద్దు
మార్జనో లోధ్రశాఖిని, గు చెట్టు.

సజ్జనో వాచ్యవత్స్యాద్ధా సజ్జ సజ్జనః—(త్రి) సత్కులమునఁబుట్టినవాఁ
నం ఘట్టగుల్మకే లా సజ్జ డు, (న) శిబిరమునకు చుట్టు వేయు
నా కల్పనాయాం తు కంచె, (స్త్రీ) నాయకుఁడధిరోహించు
టకై యేనుఁగును సిద్ధముచేయుట.

భాజనం యోగ్యపాత్రయోః, భాజనం—(న) యోగ్యము, పాత్రము.

అర్జునః కకుభే పార్థే కార్తవీ అర్జునః—(పు) మద్దిచెట్టు, అర్జునుఁడు,
ర్యే మయూరయోః ఏక. కార్తవీర్యార్జునుఁడు, నెమలి, ఒకతల్లి
మాతు రేకసుతేఽపి స్యా కొక్క కొడుకు, (త్రి) తెల్లనిది, (న)
దర్జునో ధవళేఽన్యవత్, తృణవిశేషము, నేత్రరోగము, అర్జునీ,
అర్జునం తు తృణే నేత్ర (స్త్రీ) గోవు, ఉషాదేవి, బాహుదయను
గదే స్యాదర్జునీ గవి. రాశి నది, తార్పుడుకత్తె.
ఉషాయాం కరతోయా
యాం కుట్టన్యామపి చ
క్వచిత్,

వృజినం కల్మషే క్లేశే వృజనః వృజినం—(న) పాపము, (పు) కష్టము,
కుటిలేఽన్యవత్... (త్రి) కుటిలుఁడు. [యము.

లాంఛనం లక్ష్మణే నామ్ని లాంఛనం— (న) చిహ్నము, నామధే
బంధనం వధబంధయోః, బంధనం—(న) చంపుట, కట్టుట.
జగన్నురగ్నౌ జంతౌ చ జగన్నుః—(పు) అగ్ని, జంతువు.
వచక్నుర్వాగ్మివిప్రయోః. వచక్నుః— (త్రి) మాటకారి, బ్రాహ్మ
ణుఁడు.

ప్రసూనం వాచ్యవత్సూనే ప్రసూనం—(త్రి) పుట్టినది, (న) ఫలము,
ప్రసూనంఫలపుష్పయోః, పువ్వు.

కానీనః కన్యకాజాతతనయే కానీనః—(పు) కన్యయందు జనించినవాఁ
వ్యాసకర్ణయోః. ఏర. డు, వ్యాసమహర్షి, కర్ణుఁడు.

కాననం విపినే గేహే పర కాననం—(న) అడవి, గృహము, బ్రహ్మ

దాపనేఽనుగమే ధనే, — క్రియలు, ఋణమునిచ్చుట, వెంటఁబోవుట, ధనము.

ప్రధానస్తు మహామాత్రే ప్రకృతౌ పరమాత్మని. ౯౮. ప్రజ్ఞాయాం చ ప్రధానం స్యాదేకత్వే ఽనుసదోత్తమే, — ప్రధానః—(పు) ముఖ్యుఁడు, (న) మాయారూపమగు నీశ్వరశక్తి, పరమాత్మ, బుద్ధి, ముఖ్యము, (పు) కార్యసహాయుఁడు.

గ్రామీణో గ్రామసంభూతే గ్రామీణశ్శుని వాయసే. — గ్రామీణః—(త్రి) గ్రామమునందుఁబుట్టినది, కుక్క, కాకి.

పాఠీనో మీనభేదే స్యాత్పాఠకే గుగ్గులుద్రుమే, — పాఠీనః—(పు) మత్స్యవిశేషము, ఉపాధ్యాయుఁడు, గుగ్గిలపుచెట్టు.

కౌలీనం స్యాత్కులీనత్వే గుహ్యే జన్యే కుకర్మణి. ౯౯. కౌశేయకే విహంగాది పశూనాం సంగరేఽపి చ, — కౌలీనం—(న) మంచికులమునఁబుట్టుట, రహస్యావయవము, యుద్ధము, చెడుకార్యము, పట్టుబట్ట, పశుపక్ష్యాదుల పోరు.

కౌపీనం స్యాదకార్యే స్యాద్గుహ్యచీరప్రదేశయోః. — కౌపీనం—(న) పాపపుకార్యము, పురుషునిమర్మాంగము, గోచిపాత.

విక్లిన్నో జరయా జీర్ణే శీర్ణే చార్ద్రేఽపి చ వాచ్యవత్, — విక్లిన్నః—(న) ముసలితనము, చినిగి పోనది, తడిసినది.

ఆపన్నస్సవిపత్తౌ స్యాత్ప్రాప్తే వాచ్యవదీరితః. ౧౦౦. — ఆపన్నః—(త్రి) ఆపదతోఁగూడినది, పొందఁబడినది.

విపన్నః కథితో నష్టే విపన్నశ్చ భుజంగమే, — విపన్నః—(త్రి) నష్టమైనది, (పు) పాము

విచ్ఛిన్నం చ సమాలంభే విచ్ఛిన్నే కుటిలేఽన్యవత్. ౧౦౧. — విచ్ఛిన్నం—(త్రి) మైపూఁత, ఆపదనొందినది, కుటిలమైనది.

సంపన్నం సాధితే ప్రోక్తం సంపత్తిసహితేఽన్యవత్, — సంపన్నం—(త్రి) సాధింపఁబడినది, సంపదతోఁగూడినది.

తమోఘ్నస్సూర్యవహ్న్యిందు — తమోఘ్నః—(పు) సూర్యుఁడు, అగ్ని,

| | |
|---|---|
| బుద్ధశంకరవిష్ణుషు. ౧౦౨. | చంద్రుఁడు, బుద్ధదేవుఁడు, శివుఁడు, విష్ణువు, |
| విషఘ్నాఖ్యా శిరీషే స్యాత్త్రి వృతామృతయోరపి, | విషఘ్నః—(పు) దిరిశెనపుచెట్టు, తెల్ల తెగడ, తిప్పతీఁగ. |
| శిఖీ వహ్నౌ బలీవర్దే శరే కేతుగ్రహే ద్రుమే. ౧౦౩ కేకికుక్కుటయోశ్చాఽథ శిఖీ చూడాన్వితేఽన్య వత్, | శిఖీ—(పు) అగ్ని, వృషభము, బాణము, కేతుగ్రహము, వృక్షము, నెమిలి, కోడి, (త్రి) జుట్టుకలది. |
| శాఖీ స్యాత్పాదపే వేదే తు రుష్కాఖ్యజనేఽపి చ ౧౦౪. | శాఖీ—(పు) వృక్షము, వేదము, మహమ్మదీయుఁడు. |
| ఖడ్గీ ఖడ్గాయుధే ఖడ్గే | ఖడ్గీ—(పు) ఖడ్గము, ఖడ్గమృగము. |
| శృంగీ నాగద్రుమాద్రిషు, | శృంగీ—(పు) ఏనుఁగు, చెట్టు, పర్వతము, |
| సాదీ తురంగమాతంగరథారోహేషు కథ్యతే. | సాదీ—(పు) గుఱ్ఱపురౌతు, మావటివాఁడు, సారథి. |
| పత్రీ శ్యేనే రథే కాండే ఖగద్రురథికాద్రిషు, | పత్రీ—(పు) డేగ, రథము, బాణము, పక్షి, వృక్షము, రథికుఁడు, పర్వతము. |
| వజ్రీ దశబలే శక్రే | వజ్రీ—(పు) బుద్ధదేవుఁడు, దేవేంద్రుఁడు. |
| వాజీ బాణాశ్వపక్షిషు. ౧౦౫ | వాజీ—(పు) బాణము, గుఱ్ఱము, పక్షి. |
| చక్రీ కులాలవైకుంఠకోకాహిగ్రామజాలిషు, | చక్రీ—(పు) కుమ్మరి, విష్ణువు, చక్రవాకము, సర్పము, గ్రామములకధికారి. |
| ధన్వీ ధనుర్ధరే పార్థే విదగ్ధే కకుభద్రుమే. ౧౦౬. | ధన్వీ—(పు) విలుకాఁడు, అర్జునుఁడు, నేర్పరి, మద్దిచెట్టు. |
| కృతీ స్యాత్పండితే యోగ్యే | కృతీ—(పు) విద్వాంసుఁడు, సజ్జనుఁడు. |
| పాశీ పాశధరేఽప్పతౌ, | పాశీ—(పు) పాశము ధరించినవాఁడు, వరుణుఁడు. |
| నందీ హారప్రతీహారే గర్ధభాండే వటద్రుమే. ౧౦౭. | నందీ—(పు) నందికేశ్వరుఁడు, కలజువ్వి చెట్టు, మఱ్ఱిచెట్టు. |

